# పసిడి

కథల సంపుటి

అవసరాల రామకృష్ణారావు
మంజుశ్రీ
శీలా వీర్రాజు
లత
సి. ఆనందారామం

యువభారతి ప్రచురణ

గంగిసెట్టి లక్ష్మీనారాయణ

# పంచవటి

## కథల సంపుటి

* అవసరాల రామకృష్ణారావు * మంజుశ్రీ *

శీలా వీర్రాజు * లత * సి. ఆనందారామం *

సాధారణ ఉగాదికి

యువభారతి అసాధారణ

శుభాకాంక్షలతో -

ప్రచురణ




రిజిస్టర్డ్ సంఖ్య : 1/64

సాహితీ సాంస్కృతిక సంస్థ

5. కింగ్స్‌వే, సికింద్రాబాదు-3.

# PANCHAVATI
## KATHALA SAMPUTI

యువభారతి ప్రచురణ – 4.

ప్రథమ ముద్రణ : 2000

"సాధారణ" ఉగాది – ఏప్రెల్ 1970

ముఖచిత్ర రచన

శీలా వీర్రాజు

ముద్రణ

శ్రీరామా పవర్ ప్రెస్,

సికింద్రాబాదు – 3




సభ్యులకోసం

వెల రెండు రూపాయలు. ప్రత్యేక ప్రచురణ

## పంచవటికి కలంపట్టిన కథాలాపకులు



లత * శీలా వీర్రాజు * అవసరాల రామకృష్ణారావు * మంజుశ్రీ * సి. ఆనందారామం.

# మా మాట

తెలుగువారికి—పుస్తకాలు కొని చదివే అలవాటు చాలా తక్కువ, అని అందరూ ఒప్పుకుంటారు. పుస్తకాన్ని కొనడం నిరర్ధకమనీ, వ్యర్థమనీ ఆలోచించే అలవాటున్న జనంమధ్య—అచ్చువేసుకున్న పుస్తకాలు అమ్మడం—దాదాపు సాధ్యంకానిపని. పుస్తకాలు కొని చదవడం అలవాటుగావున్న ఇతరభాషలవారి సాహిత్యాలతో పోల్చిచూస్తే—మనం వెనకబడివున్నాం. తెలుగు వారిచేత పుస్తకాలు కొనిపించడం అవసరం.

యువభారతి ఇంతవరకూ ప్రచురించిన మూడుపుస్తకాలనూ—తెలుగుజనం మధ్య వుంచడంతో కొంత అనుభవం గడించుకుంది. చిన్నకారు సంస్థలు, ప్రచురించే పుస్తకాలకు, అసలు గిరాకీలేదు. ఎన్నిసార్లు మొహమాటపెట్టి కొనిపించగలం! కొనిపించలేక పోయినప్పుడు—అచ్చువేయడం అనవసరమనిపిస్తుంది—అచ్చువేయకుండా వూర్కుండిపోతే—కృషి స్థంభిస్తుంది. కృషి స్థంభించడం—పురోగతికి దోహదకారికాదు.

వేలకొద్దీ ప్రతులు కాకపోయినా—కనీసం ఒక వెయ్యిప్రతులయినా అమ్ముడుపోయే శుభదినంవస్తే—తెలుగు సాహిత్యంలో కొత్తమార్పులు, కొత్తప్రయోగాలు జరుగుతాయనీ, చిన్నఎత్తున జరుగుతున్న కృషి, వెలుగుచూసి, నలుగురికీ తెలుస్తుందనీ ఆశించవచ్చు.

మా ఆశలకు ఊత నొసగడానికి మేము అడిగిన వెంటనే, తమకథలను ఈ సంపుటిలో చేర్చడానికి అనుమతించిన శ్రీయుతులు అవసరాల రామకృష్ణారావు, మంజుశ్రీ, శీలా వీర్రాజు గార్లకు, శ్రీమతులు లత, సి. ఆనందారామం గార్లకు— కృతజ్ఞతలు.

మా పుస్తకపథకం ఆరంభదశనుండి—ప్రోత్సాహపరుస్తూ, అండగానిలుస్తున్న మా ఆప్తులు శీలా వీర్రాజుగారికి—కృతజ్ఞతలు, ప్రత్యేకంగా చెప్పుకోవాలి. ముఖచిత్రాకృతి మలిచిన శిల్పి వీరే. అందుకూ ఋణపడివున్నాం.

వ్యాపారదృష్టితోకాక, ఉడుతాభక్తిగా సాహిత్యకృషి సల్పుతున్న మా సంస్థకు—సలహాలను, ప్రోత్సాహాన్ని ఇచ్చి, మాతో కాస్త భారం పంచుకొని, తమ సౌజన్యాన్ని చవిచూడ నిచ్చిన యం. శేషాచలం అండ్ కంపెనీ అధిపతులు అయిన శ్రీ ఎమ్. ఎన్. రావుగారికి మా మనఃపూర్వక కృతజ్ఞతలు.

నిర్ణయించిన గడువులో చక్కగా ముద్రింపించి యిచ్చిన శ్రీరామా పవర్ ప్రెస్ అధినేత శ్రీ పబ్బా శంకరయ్యగారికి మా నమస్సులు.

సహృదయులైన తెలుగుజనం—తమ సహాయ సహకారా లందిస్తారనీ—మా కృషిలో తోడ్పడి—మా పుస్తకపథకాన్ని విజయ వంతం చేస్తారనీ ఆశిస్తున్నాం.—

అనుపమ ప్రచురణలు

# పంచవటి నీడలో కాస్సేపు

సాహితీ వనంలోంచి ప్రయాణించే ఏ పాఠకుడినన్నా తన చల్లని నీడలచేతా, సన్నని గాలి తెరలచేతా ఆకర్షించి, కాస్సేపైనా కూచో బెట్టి, సేదదీర్చే పంచవటి యిది. దూర తీరాలకుసైతం తమ చల్లని గాలుల్ని పంపించగల బలిష్టమైన శాఖోపశాఖలతో పటిష్ఠంగా, ఠీవిగా, సాహితీవనంలో చాలా కాలంగా నిలిచి, ఎప్పటికప్పుడు కొత్తగాలుల్నీ, కొత్తనీడల్నీ వర్షిస్తూ కాలంతోపాటు కాంతి కిరణాలవైపు ఎదుగుతూ ఎందరో యువరచయితల, మరింకెందరో పఠితల అభిమానాలను అండగా కలిగివున్న అయిదుగురి మేలైన అయిదు కథల సంపుటి— ఈ పంచవటి.

ఎండలో మాడిపోయే కొండరాళ్ళమీదకూ, ఎండుగడ్డిమీదకూ, నల్లని మేఘాల నీడలు అప్పుడప్పుడు వచ్చి సేదనిస్తాయి. ఆ సుఖం కొద్దిసేపే. కాని, ఆకాస్త సుఖమూ, అనురాగమూ, ఆ ఓదార్పూ లేకపోతే, ఆ బండరాళ్లు పగిలిపోవూ! ఆ ఎండుగడ్డి భగభగా మండి పోదూ? అయితే, ఒకొక్కప్పుడు ఆ నల్లని మేఘాల నీడలుసైతం పెనుభూతాలై ప్రళయాన్నికూడా మోసుకురావచ్చునేమో! అదే భయం కనిపిస్తుంది. అవసరాల రామకృష్ణారావుగారి నల్లపిల్లలో. 9 వ పుటలో.

ప్రతివస్తువుకూ బొమ్మా బొరుసూ వుంటాయి. అవతలివైపు కూడా చూసినవాడే అచ్చమైన నిజాన్ని తెలుసుకోగలుగుతాడు. మనిషి పిరికివాడైతే ఫరవాలేదుగాని అల్పుడుమాత్రం కాకూడ దంటూ మంజుశ్రీగారు చూడమంటారు అవతలివైపు 25 పుటలో.

చిన్నప్పుడు పద్యాలకు ప్రతిపదార్థాలు నేర్పి, ఆ తర్వాత నిరీక్షించడం నేర్పిన ఓ చిన్నది—క్లిష్టాన్వయాలూ, కఠినసమాసాలూ నిండిన ఏ సంస్కృతపదాల తెలుగు పద్యంలాగానో ఓ చిన్నవాడికి అనిపించి, చివరకి అతనిచేతే తన కథకి ముగింపు పలికించుకున్న తీరును **కథ నాదీ — ముగింపు ఆమెదీ** లో మనోహరంగా మలిచారు శీలా వీర్రాజుగారు **40 వ పుటలో.**

“దిసీజ్ మదరిండియా” అని అనేముందు యీ గడ్డమీద రక్తమాంసాలతో ఊపిరి పీలుస్తున్న ఓ ముసిల్దాన్ని, కసాయికొట్లో అమ్మకానికిపెట్టిన మేకపిల్లలాగ కాటామీద తూకంవేసి, వ్యాపారంచేసే తల్లిలేని వెధవాయిల్నీ, డబ్బుకి కక్కుర్తిపడే తాగుబోతు సన్నాసుల్నీ. వాళ్ళ చుట్టూ మురికికూపంలా పేరుకుపోయిన అజ్ఞానాన్నీ ఫోకస్‌చేసి — ఆ మధ్యలో దైన్యం నిండిన కళ్ళతో, ద్రౌపదిలా బిక్కపోయి దిక్కులు చూస్తోన్న మదరిండియాను చూపించారు లత గారు **70 వ పుటలో.**

పూలగర్భంలోకి మకరందం చేరడమూ, ఆకుల్లోకి పచ్చరంగు జారడమూ, కన్నతల్లి గుండెలో బిడ్డమీద తేనెసోనలు జాలువారడమూ నిత్యసత్యాలూ, సత్యమైన నిత్యాలూను. అన్నికాలాల్లోనూ, అన్నివేళలా—సృష్ట్యాదినుంచీ యీనాటివరకూ అలా జరిగి, జరుగుతూ వుండి, జరగబోతూవున్న సృష్టిరహస్యాన్ని కళ్ళకు కట్టినట్టు చూపించారు సి. ఆనందారామంగారు **75 వ పుటలో.**

# నల్లపిల్ల

అవసరాల రామకృష్ణారావు

తెరిచిన పుస్తకం చేతిలో తెరిచినట్టే ఉంది. తెల్లని పేజీల మీద నల్లని అక్షరాలు కొట్టొచ్చినట్టు కనబడుతూనే ఉన్నాయి......కళ్ళు వాటిని చూస్తూనే ఉన్నాయి. కాని, చిత్రం, నా మనసు మనసులో లేదు!

నూట యాభై గజాలు ఎడంగా సమాంతరంగా ఉన్న రెండు రోడ్లను కలిపేంత పెద్ద యిల్లు నాకుంది. నేను పడుకున్న గదిలో ఇరవై మంది ఒకేసారి భోజనాలు చెయ్యొచ్చు. గదినిండా కావలసినంత స్టీలు ఫర్నీచరు ఉంది. గాడ్రేజు బీరువా లోపలి సొరుగు తీస్తే నోట్ల కట్టలు కిక్కిరిసి ఉన్నాయి. కాని, చిత్రం, ఈ సుఖంలో నాసుఖం లేదు!

మొన్నటి రోజున కాఫీ హోటలుకు వెడుతూ వీధి తలుపుకు తాళం వేశానుగాని ప్రక్కగది తలుపులు తెరిచేఉన్నాయట. నిన్న రాత్రి తెల్లవార్లూ బాత్‌రూంలో దీపం అలా వెలుగుతూనే ఉందిట. క్రిందటి శనివారమో ఎప్పుడో చాకలాడు తెచ్చిన బట్టలు అలా మడత మంచం మీదపడి ఏడుస్తున్నాయి. కాని, చిత్రం, ఇందులో నేను పట్టించుకున్నది ఒక్కటీ లేదు !

చేతిలో తాళాలగుత్తితో హెడ్ ప్యూన్ అటూ యిటూ తచ్చాడుతూ ఉంటాడు. వాడి నీడ నన్ను కదిలించలేదు. వాడి అడుగుల చప్పుడు నన్ను మరలించలేదు. అందుకే వాడు అంటాడు :

"బాబూ, చీకటయిపోతోంది... అందరూ యిళ్లకి వెళ్ళిపోయి అప్పుడే చాలా సేపయిపోయింది... తమరుకూడా..."

రాత ఆపేసి ఫైలుమూసేసి నేను వాడివైపు చూస్తాను. నన్ను చూసుకుంటాను.

"అవును... నాకెవరున్నారు ? నా కోసం ఎవరుంటారు ? వీడి కోసం పిల్లలు ఎదురుచూస్తూ ఉంటారు... వేళకి రాలేదేమని కాల్చుకుతినే పెళ్ళాం వీడికి ఉండి వుంటుంది..."

నా ఆలోచన యిక సాగదు.

కాల్చుకుతినే పెళ్ళాం నాకూ ఉండేదిమరి...

ఏరి, కోరి మా నాన్నగారు నా వయసుకో సుందర్ని జత చేశారు !

కోరి, కోరి మా ఆవిడ నా మనస్సును కొబ్బరి చిప్పను చేసేసింది !

రోజుకొక కొత్తరకం పువ్వు విరిసే పువ్వులతోట మనసు నాది. నాతో పందెంవేసి, నాకంటే ముందు కొండను ఎక్కి - అక్కణ్ణుంచి సూర్యాస్తమయం, చంద్రోదయాలను నన్నుమించి మెచ్చుకోగల రసజ్ఞురాలు నాకు కావాలి.

ప్రతి నిముషం చమత్కారంతో గిలిగింతలతో ప్రశ్నించే కళ్ళు నాకు కావాలి. కాని మా ఆవిడ కళ్ళు నన్ను సూటిగా ప్రశ్నించే విషయాలు వేరు.

"నువ్వు కట్టుకున్నదాన్ని... నిన్ను ఆకట్టుకున్నదాన్ని... ఎవడికోసం చేస్తావయ్యా... పెళ్లాన్ని సుఖపెట్టడం ఊరిని ఉద్ధరించటం కోసమటయ్యా" ఇవీ మా ఆవిడ నన్నడిగే ప్రశ్నలు.

పొద్దుట తొమ్మిదయినా అవకుండా మొదలెట్టిన ఆహారకాండ నిర్విఘ్నంగా కొనసాగటం, తిన్నది అరిగేదాకా మనుషులతోనే కాకుండా పిల్లులతో, కాకులతో వాగటం, రాత్రి తొమ్మిదయినా అవనివ్వకుండా నేను చదువుతున్న పుస్తకాన్ని అవతల పారేసి, లైటార్పేసి, మా యిద్దరి మంచాలూ దగ్గరగా లాగటం...

ఇదే మా ఆవిడ దినచర్య.

చక్కని చిన్న యిల్లు-బాత్‌రూమూ, లెట్రినూ గలది... వంట యిల్లూ, బెడ్‌రూమూ గలది-దేనికది...చుట్టూ చిన్న కాంపౌండూ... వీధిలో రెండే రెండు వరసలు - పసుపూ ఎరుపూ ఆల్టర్నేటివ్‌గా పూల మొక్కలూ-ప్రతిగదిలో వాష్‌బేసినూ, కొళాయీ, ఎలక్ట్రిక్ దీపాలూ, పడక గదిలో సీలింగుఫేనూ, చిన్న రేడియోగ్రామూ, జాతి మొగ కుక్కా... నెల జీతంలో ఓ వంతు ఖర్చుపెట్టుకొని మూడొంతులు బ్యాంకులో వెయ్యడం.

ఇంతకంటె సార్థకమూ, సకలార్థకమూ సాధారణంగా ఎవరికీ ఉండవు. మా ఆవిడకీ అంతే.

కాని నా మనసు ఈ రకం కోరికలు తీర్చలేదు. ఇలాంటి కట్టుబాట్లు ఓర్చలేదు. ఒక్క సేవింగ్సు బాక్సులోనే కాకుండా షేవింగు బాక్సులో కూడా 'విశ్వరూపదర్శనం' గల నా ధనజాతకం మా ఆవిడకి యిష్టమే. కాని అడిగినదానికి లేదనకుండా నోట్లయినా చిల్లరగా ఇచ్చేసే నా దాన జాతకం ఆవిడకి చాలా కష్టం కలిగించింది.

అందుకనే అప్పటికప్పుడు ఉద్యోగమూ, ఉన్న బలగమూ పోయి చిక్కుల్లో పడ్డానని మా స్నేహితుడు ఇంత యిల్లూ పది పోను వేలకి అమ్ముతానని కూచుంటే ఇరవై వేలకి రైటుచేసి పుచ్చుకున్నాను! మూడొంతులు అద్దెకిచ్చేసి రెండుగదుల్లో ఉందామని మా ఆవిడ పెట్టిన అల్లరే మిగిలిపోయింది. అది వెళ్ళిపోయింది. తన దగ్గరున్న చిన్నయిల్లు విడిచిపెట్టి చాలా పెద్ద యింటికి వెళ్ళిపోయింది! ఇక ఈ యింట్లో ఆడదీ లేదు, అల్లరీ లేదు అనుకున్నాను, కాని...

* * * *

కిరుగ్గిన గేటు చప్పుడయింది.

గుండెలమీద పుస్తకాన్ని పక్కకితీసి, ఎడంచేత్తో సిగరెట్టు పీక ఆర్పి విసిరేసి, ఒక్కగంతులో వీధిలోకి వెళ్ళిపడ్డాను. ఏమీ లేకపోవడం అంటే అనేకం ఉండడం అనుకుంటాను. ఇల్లు వల్లకాడయినా, మనసు రాయి అయినా గార్డెనింగ్ మీద నాకు మోజుతగ్గలేదు. అన్ని మొక్కలకూ రోజూ ఏదో వేళప్పుడు నీళ్ళు పోస్తేగాని నాకు తోచదు. పది రోజులపాటు గెడ్డం గీసుకోకపోయినా నాకు కష్టం అనిపించదు, కాని పచ్చని మొక్క పళ్ళెంలో ఏమాత్రం గడ్డి మొలిచినా నాకు తోచదు.

స్వయంగా మొక్కలపని చేసుకుంటేగాని నేను ఉండలేను. ప్రతిరోజూ ప్రతిపువ్వు దగ్గరకూ వెళ్ళి "ఏమే, ఇంకా నువ్వు విడలేదుటే?" అని పలకరించందే నేను బ్రతకలేను. పువ్వుల మొక్కల్ని పెంచడమే పూజ అని నా ఉద్దేశం. అవి ఎవరు తెంపినా నేను సహించలేను. అనుకున్నంతా అయింది... నేను వెళ్ళడం ఆలశ్యం అయింది... ఆ పసుప్పచ్చ గులాబీ పువ్వు చెట్టున లేదు!

మూడేళ్లు వరుసగా పదేసి రూపాయలు తగలేసి ఎగ్జిబిషన్‌లో కొన్నాను. బతకలేదని కడియం నుంచి తెప్పించి వేశాను. వేసి ఆర్నెల్లయింది. బతికింది... ఇదే మొదటి పువ్వు... ఇవాళ పూర్తిగా విడిలింది... నిలబడ్డ నీడలాంటి చిన్నపిల్ల... ఎడంచేతిలో పువ్వుతో కనిపించింది. వెంటనే వెళ్ళి ఆ చెయ్యి పట్టుకున్నాను... కసిదీరా లెంపకాయ కొట్టడానికి కుడిచెయ్యి ఎత్తేను. కాని...

ఆ పిల్ల ఏ మాత్రమూ భయపడలేదు. పారిపోడానికీ, తప్పించుకోడానికీ ప్రయత్నం చేయలేదు. నా కళ్ళలోకి సూటిగా చూసింది... నా ముఖంలో దానికేం కనబడిందో తెలీదు... నవ్వుతూ మళ్లీ రెప్ప వేయకుండా నా కళ్ళలోకి చూసింది... నేను చెయ్యి దించేశాను.

ఆ తరువాత నేనేం చేశాను? మామ్మలు అయిదేళ్లు దాటని మనమలచేత ఉఋరగాయ తీయించేందుకు కట్టించే చీకటిమడి-లేదా-ఫుల్ యూని ఫారంలో ఉన్న-మట్టి మరకలు తప్ప మరే ఆభరణాలూ లేని ఆ మూడేళ్ళ పిల్లదాన్ని రెండు చేతులతోనూ ఎత్తుకొని ముద్దెట్టుకున్నాను... మళ్ళీ ఆ కళ్ళల్లోకి చూశాను. నా మనసులోకి చూసుకున్నాను.

ఇక ఈ యింట్లో ఆడదీ, అల్లరీ లేదనుకున్నా ననుకున్నాను కదూ... కాని ఇంతకు మించిన అల్లరి వచ్చిపడింది. కాని ఈ అల్లరి తీరు వేరు. ఆ మోహావల్లరి పేరే-నన్ను పరామర్శించడానికి వచ్చిన మా పెద్దక్కయ్య మూడో కొడుకు బాబ్జీగాడు.

మా పెద్దక్కయ్య వెళ్ళిపోతూ అంది.

"ముప్పై ఏళ్లయినా వెళ్లలేదు...మళ్ళీ పెళ్లి చేసుకో తమ్ముడూ నీ కెన్నిమార్లు చెప్పేదిరా ?" - అంది లాలింపుగా.

"అమ్మానాన్న ఉంటే నిన్నిలా ఒక్కణ్ణీ ఉండనిచ్చేవారా ! ఉన్నన్నాళ్లూ కాల్చుకుతింది, మహాతల్లి... ఓ బిడ్డనేనా యిచ్చి వెళ్లిందా ?"

అవును...అదే కాదు. నేనూ గొడ్డుమోతునే, బిడ్డ ఒకటి ఇంట్లో ఉండాలన్న విషయం నాకు బాబ్జీవచ్చిందాకా తెలియనేలేదు. రైల్లో టికెట్ కలెక్టరు పెద్దక్కయ్య రెండోకొడుక్కి వయస్సడిగితే అక్కయ్య పన్నెండేళ్లని చెబుతే "లేదండీ అన్నయ్యకు పదిహేడు వెళ్లాయని అమ్మ నాన్నతో అంటుంటే విన్నాను" అని చెప్పిన కొంటెవెధవ బాబ్జీ. వాడింట్లో ఉంటే ఎవర్నీ ఏ పేపరూ చదవనియ్యడు. ఏబొమ్మో చూపించి "ఇదేమిటో చెప్పవ్ ?" అని మొదలెడతాడు. చెబితే "ఎందుకలా జరిగింది ?" అని ఎదురుప్రశ్న వేస్తాడు. పిల్లల ప్రశ్నలకు జవాబుచెప్పే నేర్పరితనం ఒక్క భగవంతుడికే ఉందేమో నాకుతెలీదు.

"అమ్మా, పెద్ద మామయ్యకీ, చిన్న మామయ్యకీ ఇంత మందికి పెళ్ళిళ్లు జరుగుతున్నాయి కదా, మరి నీ పెళ్లి ఎప్పుడే ?"

అని అడిగేటంత జిజ్ఞాస వాడిది.

మా ఆఫీసుకు వచ్చి రంయ్‌మని మేడమెట్లు ఎక్కేస్తూంటే "ఎవరీ అబ్బాయి ? పట్టుకోండి పట్టోకండి" అని అక్కడివాళ్లు అడ్డొస్తే "నేనయ్యా ఇనస్పెక్టరుగారి మేనల్లుణ్ణి. పైన ఏముందో చూద్దామని వచ్చాను... అడ్డులే" అని దబాయించేంత చొరవవాడిది. ఇంతెందుకు ? వాడు రాగానే వేసిన ప్రశ్నే నన్ను కలవర పెట్టేంతటిది.

"అయ్య బాబోయ్... ఎన్ని రంగుల పువ్వులో... మావయ్యా ఆకులన్నీ ఆకు పచ్చేగదా, పువ్వులన్నీ ఇన్ని రంగులేమిటీ ?"

వచ్చిన రెండో నాటికే బాబ్జీ నాకు బాగాచేరికై చేరువై పోయాడు. ఒంటరితనం భరించలేక ఇల్లు చేరడమే గండంగా భావించే నేను, వాళ్లున్న వారంలోనూ మూడురోజులు శలవు పెట్టేనంటే నాకూ వాడికీ ఉన్న అనుబంధం ఎంత దృఢమై పోతోందో తెలుస్తుంది.

"ఓ బిడ్డనేనా ఇచ్చి వెళ్లిందా?" అన్న అక్క ప్రశ్నకు నామనసు తుళిక్కి పడింది. మనసులో ఉన్నది మరిదాచుకోలేక అనేశాను.

"లేదు, ఇవ్వలేదు... కాని నీ నలుగురు బిడ్డల్లోనూ నువ్వో బిడ్డను తలుచుకుంటే ఇవ్వగలవు. నువ్వే ఓ బిడ్డనిచ్చి వెళ్లు పెద్దక్కా"

పెద్దక్కయ్య కోపంగా చూసింది.

"అవును...వాడి కుతూహలం తీర్చే టైము నీకులేదు...వాడి తెలివి తేటలకి సరిపడే చదువు చెప్పించే డబ్బు బావకిలేదు..."

"నీ ఆస్తి మాకేం అక్కర్లేదు తమ్ముడూ..."

"కాని భాగ్యవంతురాలివి. నీ ఆస్తే నాకు కొంచెం పంచియ్యి పెద్దక్కా...జీవితంలో అనేకరకాల దెబ్బలుతిని మొక్కలీన్ని, మోళ్ళనీ చూసుకుని బ్రతుకుతున్నాను... ఎంత దిక్కుమాలిన తల్లయినా తన

బిడ్డను ఇవ్వడానికి ఒప్పుకోదు నిజమే... నువ్వేం వాణ్ణి దత్తత చెయ్యక్కర్లేదు. బావతో ఆలోచించి... వాడి చదువయ్యే దాకానైనా నా దగ్గరుంచు పెద్దక్కా...నీ మాట బావకాదనడు..."

పెద్దక్కయ్య నా కళ్ళను తుడవలేదు... నాకేం ధైర్యమూ చెప్పలేదు... అక్కణ్ణుంచిలేచి వెళ్ళిపోయింది. నాలుగు రోజులకు ప్రయాణం పెట్టుకున్నది, ఆ మధ్యాహ్నమే బయలుదేరిపోయింది.

అక్కయ్య వెళ్ళిపోయింది... బండి కదలనిచ్చి గేటు తలుపు దగ్గరగా వేసి దిగులుగా శూన్యహృదయంతో కూచున్నాను.

కిర్రున గేటు తలుపు చప్పుడయింది.

బాబ్జీ పరిగెత్తుకువచ్చి నా చంక ఎక్కేశాడు.

"జట్కా వెడుతుంటే గెంతేశాను. నన్ను గదిలోపెట్టి ..తాళం వేసెయ్యి మావయ్యా-అమ్మ వచ్చి అడుగుతే నాకు తెలీదను... నేను నిన్ను విడిచిపెట్టి వెళ్ళను మావయ్యా"

మళ్ళీ తలుపు చప్పుడయింది. అక్కయ్య బండి దిగింది.

"తప్పు బాబూ మీ అమ్మతో నువ్వు వెళ్ళిపో"

"ఉహుఁ నేను వెళ్ళను...ఇక్కడే నాకు బాగుంది."..వాడు గునుస్తూ కాళ్ళు ఆడిస్తూంటే, చెప్పొద్దూ, వాణ్ణి ఎత్తుకున్న నాకు కొంచెం గట్టిగానే తగిలాయి.

"దిగి నాతో వస్తావా, రావా, వెధవన్నర వెధవా" అని పెద్దక్క వాణ్ణి రెండు అంటించబోతే తప్పుకున్నాడు. ఆ దెబ్బలూ నాకే తగిలాయి. నేను కళ్ళమ్మట నీళ్ళు తుడుచుకున్నాను, ఇంచు మించు ఏడుస్తూ, నవ్వుతూ.

"తమ్ముడూ, నా పిల్లలతో నేనెక్కడో నాకు కలిగింది పెట్టుకుని కాలక్షేపం చేస్తున్నాను. నిన్నెప్పుడేనా పదిరూపాయలు పంపించమని అడిగానా ? నేనేం అపకారం చేశానని నన్నిలా బాధపెడుతున్నావ్ చెప్పు ? ఏమీ ఎరగని గుంట నాగమ్మకేదో నూరిపోసి తల్లికీ పిల్లల్ని విడదీస్తే నీకేం కలిసొస్తుంది చెప్పు ?" హృదయం ముక్కలయిన నా నోట వచ్చే జవాబంటూ ఏం ఉంటుంది? నా మెడకు చుట్టబడిన చేతుల్నీ, నా నడుముకు చుట్టబడిన కాళ్ళనీ, నా మనసుకు చుట్టబడిన వ్యామోహాన్నీ బలవంతాన ఊడదీశాను. అతి ప్రయత్నంతో పెద్దక్క వాణ్ణి అదిమి పట్టుకుంది. వాడు సూటిగా నా కళ్ళలోకి చూస్తున్నాడు. నేను రెప్పదించేశాను. మాట్లాడితే వాడికి తెలుస్తుంది... చూపులూ మనసులూ వాడు ఇట్టే పోల్చుకోగలడు... వాడికి తెలియకుండా నే పెద్దక్కకి నా భావం ఎలా అందించేది? రాసిస్తే సరి. అవును...వాడికింకా అక్షరాభ్యాసం కాలేదు... ఇంకా ఆరేళ్ళు వెళ్ళలేదు. "పెద్దక్కా... నిన్ను అడగకూడనిది అడిగి అవమాన పరచి నందుకు ఈ దీనుణ్ణి క్షమించు... ఇప్పుడు రైలు ఎలాగో తప్పిపోయింది గనక రాత్రి బండికి వెళ్ళండి... నేను ఆఫీసుకి వెడుతున్నాను. నా అత్యాసకు మరొకసారి మన్నించు"అని రాసి, దానికిచ్చేశాను. గేటు దగ్గరకు వచ్చేసరికి వాళ్ళమ్మనిరక్కి ఎలాగో తప్పించుకునివచ్చి నా కాళ్ళకుచుట్టుకున్నాడు బాబ్జీ"ఎక్కడికెళ్ళ పోతున్నావ్ మావయ్యా" అనుకుంటూ. ఎడంచేత్తో కళ్ళు రెండూ తుడుచుకొని వాణ్ణి బలవంతాన విడిపించుకున్నాను, 'శెలవు పెట్టి వస్తా' అని ఒట్టు వేయించుకుని. శలవు పెట్టిన మాట నిజమే... తిరిగి తిరిగి మా స్నేహితుడు గోవిందు ఇల్లు చేరుకున్నాను. ఆ రాత్రి వాళ్ళింట్లోనే భోంచేసి అక్కడే పడుకున్నాను. ఆ రాత్రి అయిదు నిమిషాలైనా నిద్రపట్టలేదు. పొద్దుట లేస్తే ఎందరో పిల్లల్ని చూస్తూంటాం. బాబ్జీ ఇంతగానన్ను వశీకరణ చేసుకున్నాడేమిటి?

ఏమీలేకపోవడమేమిటి? వాడి వైవిధ్యం చెప్పడానికి వాడి నడక ఒకటే చాలు. ఓసారి నోటిముందు కుడిచెయ్యి అరచెయ్యి నిలువుగా పెట్టుకుని ఈదుతూ రైలాట ఆడుతూ వస్తాడు. మరోసారి ఏరాయినో 'ఫుట్‌బాల్' ఆడుకుంటూ వస్తాడు. మరోసారి తొక్కుడు బిళ్ళ ఆడు కుంటూ గెంతుకుంటూ వస్తాడు. మరోసారి ఒప్పులకుప్ప తిరుగుతూ వస్తాడు. ఎప్పుడూ ఏ పరిస్థితుల్లోనూ మామూలుగారాడు. వాడి ఊహాలకీ, వాడి ఊసులకీ కూడా ఇన్ని రంగులూ ఉన్నాయి. నాలు గంతస్తుల మేడకన్న ఎత్తయిన మోదుతాడి తొర్రలోంచి పైకి వచ్చని మెడా, ఎఱ్ఱని ముక్కు మాత్రమే పెట్టి విన్నవారిని ఊటలూరించే కీరగీర్వాణి అది. నాకొకసారి స్టేషనుకువెళ్ళి వాణ్ణి చూచి ఏ రబ్బరు పిల్లినో కొనివ్వాలని అనిపించింది. 'గొడ్డువాడివి, గొడ్డులా బతుకు తున్నవాడివి. ఇంకా ఆకర్షణలూ, అభిమానాలూ నీ కెందుకు? నువ్వే ఇంతగా ప్రేమిస్తే కన్నతల్లి, ఆమె ప్రేమ ఎలా ఉంటుందో ఆలో చించావా?... నీస్వార్థం కోసం ఇంకా వాళ్ళను ఒకరికొకరిని దూరం చేస్తావా?'

నేను ఆ రాత్రి అక్కణ్ణుంచి కదల్లేదు. బతికేఉన్నాను. ఊళ్ళోనే ఉన్నాను. కాని కదల్లేదు. వాణ్ణి చూడకుండా అన్ని గంటలు ఉండగల నిబ్బరం ఎలావచ్చిందో నాకే అర్థం కాలేదు. ఏ తెల్లవారు ఝామునో నిద్ర పట్టిందేమో ఎనిమిదిన్నరకి కాని మెలకువ రాలేదు. కాఫీ తాగు తుంటే మా పెద్దబావ వచ్చాడు. నేనాశ్చర్య పోయాను. 'ఇదేమిటీ, ఎప్పుడొచ్చావ్?' అని పలకరించాను. బావ ఇంత మొహం చేసుకుని మెల్లిగా మొదలెట్టి క్రమంగా ఫోర్సు ఎక్కించాడు. "ఏంచెయ్య మంటావ్. మీ కుర్రకారు వాళ్ళు చేసే పనులన్నీ యిలాగే ఉంటాయి. పెద్దరికాలూ ముందు చూపులూ ఉండవు. ఏదో చుట్టపు చూపుగా

వస్తే అసలే అసాధ్యుడు గదా వాణ్ణంత నెత్తి కెక్కించుకోడం దేనికి ? నేనయినా వెండీ బంగారం పెట్టలేక పోవచ్చు గాని నా పిల్లలేం నాకు బరువని అనుకోలేదే ?"

నేను ఉండని సంజ్ఞచేసి లోపలికి వెళ్ళి మొహం కడుక్కుని వచ్చాను. నా దీన వదనాన్ని అదేం దాచలేక పోయింది.

"ఏదో అడిగాడు, మీకిష్టంలేదూ, సరే, ఇప్పుడు తగవేముంది ?" అని గోవిందు సర్ద బోయాడు.

"అక్కడితో సరిపోతే బాగానే ఉణ్ణు. ఈయన వెళ్ళిందగ్గిర్నుంచీ వాడు ఒకటే ఏడుపుట. దానికి ఏంతోచక నాకు వైరుచేసింది. పిల్లల్ని యింటి వాళ్ళకి అప్పచెప్పి తెల్లారఝాము ప్యాసెంజర్లో పరిగెత్తు కొచ్చాను. తీరా వచ్చేసరికి వాడికి నూటరెండు జ్వరం."

నా చెవులకి మరేం వినబడలేదు. వీలయినంత తొందరగా బాబ్జీని చేరుకున్నాను. నన్ను చూడగానే పెద్దక్కయ్య భోరున ఏడ్చేసింది. ఎక్కడి కెళ్ళిపోయావ్ బాబూ, ఆఫీసుకి కబురంపిస్తే అసలు అక్కడికి రానేలేదన్నారు. ఇంక వీడు నువ్వెళ్ళిందగ్గిర్నుంచీ మంచినీళ్ళు ముట్టు కోలేదు. అమ్మా, మావయ్యెక్కడి కెళ్ళాడే. ఎప్పుడొస్తాడే? అని నిమిషానికి వందసార్లు ఇవే ప్రశ్నలు. రాత్రి జ్వరం తగిలింది. ఒకటే కలవరింతలు... ఆఖరికి మీ గుమాస్తా గారిచేత ఆయనకి వైరు చేయిం చాను. పొద్దున్న బంట్రోతు చెప్పేడు నువ్వెవరో గోవిందు గారింటి కెళ్ళేవని. దిక్కు మాలినదాన్ని, కుర్రాడి మనసు ఇంతలా దెబ్బ తింటుందని ఊహించలేక పోయాను తమ్ముడూ! చూడమ్మా బాబ్జీ. ఇదిగో మావయ్యొచ్చాడు."

బాబ్జీ నెమ్మదిగా రెప్పలు విప్పేడు. రెండు చేతులూ జాచేడు నా మెడను కౌగలించుకున్నాడు. నన్ను ముద్దెట్టుకున్నాడు.

'నీదగ్గిరే ఉండిపోతాను మావయ్యా' అన్నాడు. ఎంత మెల్లిగా అన్నాడు! ఒక్క రాత్రికే ఎంత నీరసంగా అయిపోయాడు!

"అలాగే బాబ్జీ. మావయ్య దగ్గిరే ఉండి పోదువుగాన్లే. అది చెప్పడానికే నేనువచ్చా" అన్నాడు బావ. బాబ్జీ నాన్నవైపు చూశాడు. వాడిచూపుల్లో స్పష్టంగ భయం కనిపించింది.

'లేదు... లేదు... మీరు నన్ను తీసుకెళ్ళి పోడానికే వచ్చారు. నేను రాను. అమ్మ మిమ్మల్ని పిలిపించింది...అవునా? నాన్నా? నేను రాను. నన్ను పంపించెయ్యకు మావయ్యా' అని కాళ్ళూ చేతులూ కొట్టుకోటం ప్రారంభించాడు. ఎంత చెప్పినా వినడూ, సంతుష్టిపడడూ ఎలాగ?

అక్కను వీధివైపు పంపించేసి వాడిప్రక్కలో అలా జోకొడుతూ కూచున్నాను. వాడికి కాస్త నిద్ర పట్టినట్టు తోస్తే మెల్లిగా వీధిలోకి వెళ్లేను, బావను అక్కడ కూచోపెట్టి...

పెద్దక్క వీధిగుమ్మం మీద కూచుని ఉంది. నేను వెళ్ళగానే దగ్గిరగా పిలిచింది. నా తల నిమిరింది నిమురుతూ అంది.

"మీ ఇద్దరి అనుబంధానికీ కారణం నాకిప్పుడు తెలిసింది బాబూ వయసు పెరిగినా మనసు విరిగినా పరమాత్మ స్వరూపమైన పసితనం నీలో ఏ మాత్రమూ వసివాడిపోలేదు తమ్ముడూ...అందుకే మీ ఇద్దరు అంత దగ్గిరయ్యారు. నిజానికి దూరమైంది ఆ సంగతి తెలుసుకోంది నేనే నా మాటలకి మరోలా అనుకోకు బాబూ"

"మళ్ళీ ఎక్కడికెళ్ళి పోయావు, మామయ్యా" అని పెద్ద కేక వేసి బాబ్జీ యివతలి కొచ్చేశాడు. నేనూ పెద్దక్కా హడావిడి పడ్డాం. బావకూడా పరిగెత్తుకు వచ్చాడటున్నుంచి. కాని బాబ్జీ తూళి క్రిందపడి పోయాడు. డాక్టరు కోసం పరిగెత్తాం... కాని డాక్టరు అవసరం లేక పోయింది ! చేజేతులా వాణ్ణి నేను పొట్టన బెట్టుకున్నాను.

* * * *

నాటికీనాడు... ప్రపంచంలో ఆరోగ్యమంతా తనదే అన్నంత ఉక్కుముక్కలా ఉన్న ఈ నల్లపిల్ల...అతి పెంకితనం చేస్తే నేను కొట్ట బోతే "అలా పైకి అంటున్నావుగాని నువ్వు నన్ను కొట్టలేవులే మావయ్యా" అని నాలోని అభిమానంతో ఆటలాడుకునే మాబాబ్జీ లాగ... అవే చూపులు... అవే కళ్ళు... నన్ను మైమరపించి ఎత్తుకు ముద్దాడేలా చేశాయి.

వెనకాలే సుడిగాలిలా వచ్చిపడింది - మరో నడుస్తున్న చింత మొద్దు. దాని మాటల సారాంశం యిది :

అది నేరేడు పళ్ళమ్ముకుంటుందిట... దాని పిల్ల యిది... మూడేళ్ళు వెళ్ళినా యింకా పాలకోసం అమ్మని బరుకుతూనే ఉంటుందిట... ఇంకా ఉయ్యాల ముచ్చటకూడా ఈ గుంటకి తీర లేదుట... తల్లి పళ్ళమ్ముకున్నా ఈ మణుగురాయిని అలా జోలిలో వేసి తిప్పవలసిందేనుట... ఎదురింట్లో పళ్ళు కొలుస్తూఉంటే ఇది జోలిదిగి ఇలా పరిగెత్తు కొచ్చిందట. చెట్టున పువ్వుండటం ఆ మైనగోరకి అట్టే పట్టదుట...

"చూడమ్మీ... ఈవీధి చివరదాకా పళ్ళమ్ముకుని ఒచ్చేటప్పుడు మళ్ళీ యిలారా... అప్పుడు దీన్ని తీసుకుపోదుగాన్లే. నా కిప్పుడు ఆఫీసుకి శెలవు... ఏం తోచడం లేదు... రోజూ ఇలాగే చెయ్యి... నీకేవైనా యిస్తాను...

అది అదోలా చూసింది... మా దాసీది సర్ది చెప్పింది.

"నీ పిల్లను బాబుగారేం మింగేయ్యరులేవే. ఆయన కడుపున ఓ కాయ కాయక ఇలా నీ పిల్లనీ, నీ పిల్లనీ పట్టుకు దేవుళ్ళాడ వల సొచ్చింది. కుంచేపు బరువు తగ్గినా తగ్గిందే... అలాపోయి అమ్ముకురా ఎంతలో రావాల గనక...

"ఏవేఁ ఒరసచ్చీ... నన్నొగ్గి ఉండగల వేఁటే?"

"ఓ" అంది ఈ కోయిల.

"నేరేడు పళ్ళమ్మా నేరేడు పళ్ళూ" అనుకుంటూ నేరేడు పళ్ళమ్మ వెళ్ళిపోయింది. నేనది వచ్చేలోగా ఎన్ని చేశానని! దాన్నేత కొళాయిక్రింద స్నానం చేయించాను. దాసీది ఒక్కటే జడ వేస్తే విప్పించి రెండు జడలు వేయించాను. రెండు పెద్ద గులాబీ పువ్వులు తలలో నేనే పెట్టేను. పక్కనున్న హోటల్ నించి ఇడ్డెన్లు తెప్పించి ఇచ్చాను. బిళ్ళల పేకెట్ కొని చేతికిచ్చాను. దాన్నేత పదే పదే నా పేరు "లామకితనాలావు" అని చెప్పించుకుని మురిసి పోయాను!

కాని దాని కక్కరలేక పోయినా నాకు కావలసి వచ్చిందీ, నేను చెయ్యలేక పోయిందీ ఒకటుంది. దానికి బట్టలెక్కణ్ణుంచి తేను? ఆరేళ్ళ సర్వీసులో ఇంత క్లిష్ట సమస్య నా కెప్పుడూ ఎదురవలేదు.

ఆరడుగుల తాడిచెట్టుని నేను. మూడడుగులు కూడా లేని వామనమూర్తి అది. ఇంట్లో ఆడదిక్కు లేదు. ఊళ్ళో పాపుదిక్కు లేదు. ఆవాళ ఆదివారం. దీనికి వస్త్రదానం కోసం ఏ కృష్ణుణ్ణి ప్రార్థించను? వేమనగారి ప్రియశిష్యురాల్ని ఎలా సత్కరించను ? మా ఆవిడ తాలూకు ఏ జాకట్టో దొరక్కపోదని పెట్టెలన్నీ గాలించాను. ఓ రెడీ మెడ్ ప్యాకెట్టు ఒళ్ళోపడింది. అవి నేను బాబ్జీకోసం వెళ్ళేటప్పుడు యిద్దామని కొన్నబట్టలు... అవి వాడికి ఇవ్వలేక పోయాను... నా గుండె దడదడ కొట్టుకుంది. ఒళ్ళంతా చెమటలు కమ్మేయి.

ఏమిటి? ఏమిటి నేను చేస్తున్నది? "అదెవరూ, నేనెవరు?"

ఈ అనురాగ జలధి మళ్ళీ దేనికి? మరెవర్ని ముంచెయ్యడానికి? సంసార సుఖాలనన్నీ త్యజించి మునివృత్తి స్వీకరించి నిష్ట జీవితం గడిపే పారమార్థికుల కుటీరాలలోకి కూడా లేడి పిల్లలు తొంగి చూస్తాయి. వేదవిద్యలు వల్లిస్తూంటే బొడ్డూడని లేడిపిల్లలు తాపసుల ఒడిలోచేరి వాత్సల్యాన్ని చూరగొంటాయి. నిజమే...

కాని ఈ ఆకర్షణ ఎంతసేపు?

ఎండలో మాడిపోయే కొండ రాళ్ళమీద, ఎండు గడ్డిమీదకు నల్లని మేఘాల నీడలు అప్పుడప్పుడు వచ్చి సేదనిస్తాయి. కాని ఈ సుఖం ఎంతసేపు?

నేను బాబ్జీ చొక్కా లాగూ దానికి తొడిగించాను. ఇంతలో పళ్ళమ్మి వచ్చింది. అది దాన్ని పోల్చుకోవడమే కష్టమైపోయింది. అది నన్ను విడిచి వెళ్ళనంటే నాగుండెలు భయంగా కొట్టుకున్నాయి.

"రేపు మళ్ళీ ఇద్దూగాని లే", అని దాన్ని బలవంతాన పంపించాను.

"చూడూ-మళ్ళీ నీ పిల్లని ఈ ఛాయలకు తీసుకురాకు... బాబు గారి దృష్టి మంచిది కాదుట" అని దాసి దానిచేత పెద్ద అబద్ధం చెప్పించాను. వీధి తలుపు వేసేసి "ఉస్సు"రని పక్కమీద చేరేను.

"ముళ్ళ పొదల్లా బండరాయిలా ఈ బతుకును ఇలాగే సాగిపోనీ... చేతులెత్తి ప్రార్థిస్తున్నాను... ఇంకా ఈ నిర్భాగ్యుణ్ణి గిలిగింతలు పెట్టకు" అనుకున్నా.

# అవతలి వైపు

మంజుశ్రీ

రంగనాథరావుకి ఉలికిపడినట్లు మెలకువ వచ్చింది. ఒకటి, రెండు, మూడు, తలుపుమీద చేతి చరపులు వినవస్తున్నాయి. బద్ధకంగా ఒత్తిగిల్లాడు. కొంచెం విరామం. మళ్లా తలుపుమీద చప్పుడు. ఈ సారి చాలా కోపంవచ్చింది. లిప్తపాటు నిరీక్షించాడు, సుభద్ర లేస్తుందేమోనని. ఊహూ. ఆవిడ హాయిగా పవ్వళించే వుంది. విసురుగా పోయి తలుపు తెరచాడు. సన్న తుంపరులు పడుతున్నట్లున్నది. ఆహ్లాదకరమైన అనుభూతిని కలగచేసే వాతావరణం. చిరుచలి. ఇంకా సూర్యుడి కిరణాలు చెట్ల చివరలకైనా చేరలేదు. 'అమ్మగారు ఇయ్యాల శేరు పాలు ఎక్కువతెమ్మన్నారు ?' అంటోంది పాలమనిషి. కళ్ళ కేమిటో కొత్తగా వుంది. మాంచి బింకమైన వయసులో, మంచు బిందువులు

పడిన ముద్దబంతి పూవులాగుంది, పాలగిన్నె కింద పెడుతున్న వయసులో వున్న ఆడకూతురు. 'ఎవరు నువ్వు' అన్నాడు రావు. 'నాను తెల్దేటి' అని పళ్ళు పదీ కనపడేలా తళుక్కున నవ్వింది. 'మాలచ్మిని కాదేటి ?' అని పలికింది. 'ఆసి నీ దుంపతెగ. ఎంతలావొాళ్ళు చేశావే'—అనుకున్నాడు రావు. టీపాయ్‌మీద గంగాళంలాటిగిన్నె వుంటే దాన్నితెచ్చి పాలు పోయించుకున్నాడు. మాలక్ష్మి వెళ్ళిపోయింది.

రావు మళ్ళా తలుపు గడియపెట్టి పక్కమీద కూచున్నాడు. టీపాయ్‌మీద సిగరెట్ పెట్టి తీసుకుని, సిగరెట్ వెలిగించాడు. సుభద్ర వేపు చూశాడు. ఇటువేపు ఒత్తిగిలి పడుకుంది. భుజంమీద ఆచ్ఛాదన పక్కకి జారిపోయింది. పెదవులమీద తీరిపోయిన అలసటను సూచిస్తున్న చిరునవ్వు. పెదవుల్లో సౌకుమార్యంలేదు. మొద్దుబారిపోయి వున్నాయి. ముసలి చిరునవ్వు అనుకున్నాడు. అట్లా సుభద్రను చూడగానే చిరాకు పుట్టుకొచ్చింది రావుకు. 'ఈ పెదవులనేనా గులాబి రెక్కలనీ, మందార మొగ్గలనీ, నాల్రోజులు పుట్టింట వుండవలసి వచ్చిన పెళ్ళాన్ని ఆకాశాని కెత్తేస్తూ తాను ఉత్తరాలు వ్రాసింది. ఒళ్లు గగుర్పొడిచింది. ఒదులు ఒదులుగా రెవిక వేళ్ళాడిపోతున్నది. జుట్టంతా చిందరవందరగా వుంది. నిన్న సాయంకాలం తలంటుకొని వుంటుంది. లెక్క పెట్టటానికి వీలుగా తెల్లటి వెంట్రుకలు కనపడుతున్నాయి.

గాలిపోయినటైరూ, సాగిపోయినరబ్బరూ, అరిగిపోయినజోడూ, ఆ గదిలోనే అక్కడాఅక్కడా కన్పించాయి. సుభద్రవేపు చూశాడు. సిగరెట్టు పొగతో గుండెంతా వెచ్చబడింది. సుభద్ర చెయ్యిమీద చెయ్యి వేసి గాజులు సవరించాడు. చెయ్యికాస్తా వెనక్కు లాక్కుంది భువనైక సుందరి. రుబ్బురోలులా అటునుంచి ఇటు కదిలింది. అబ్బా! ఆ ముసలి నవ్వు. ఆ పెదవులపైన నల్లనిచారలు. రావుకి కష్టమనిపించింది.

బయట వాన పెద్దదయింది. పది నిముషాలు తక్కువ ఆరు. అయినా ఇంకా ఐదుకూడా కానట్లే వుంది.

సుభద్ర కళ్ళు తెరిచింది. ఆ కళ్ళచుట్టూ నల్లని వలయాలు. భావగర్భితంగా నవ్వింది అతనివేపు చూసి. మెడకింద ముడతలు ముడతలుగా జారిపోతోంది శరీరం. రావు నవ్వలేదు. నవ్వురాలేదు.

'పాలమనిషి వచ్చిందా ?'

రావు విసుక్కున్నాడు.

'ఎక్కువ పోయించుకున్నారా ?'

'తప్పుతుందా, నువ్వు చెప్పిన తరువాత'.

'ఆహా ఏం భయభక్తులు !' అని వెటకారంగా ఆమె పయట బయటకు తీసి భుజాల చుట్టూ కప్పుకుంది. పొట్టదగ్గర చూశాడు. ముడతలు ముడతలుగా పొట్ట కిందకి జారిపోయింది.

'ఇవాళ ఎంత పనుందో ! వేగిరం లేపకపోయారా' అంటూ లేచి, ఊడిపోయిన జుట్టును, కొప్పుగా ముడుచుకుంది. ఇంట్లోకి వెళ్ళిపోయింది, వరండా తలుపు తీసి. రావుకి చాలాకోపం వచ్చింది. పాతికేళ్ళుగా కాపురం చేస్తున్నా, ఎప్పుడు ఏ విధంగా ప్రవర్తిస్తే తనకు నచ్చుతుందో సుభద్రకు తెలీదు. ఐదుగురు పిల్లలైతే కలిగారు. రావుకి చాలా అసంతృప్తి కలిగింది. ఆ తలుపు దగ్గరగావేసిపోవాలని తోచలేదు సుభద్రకు. మళ్ళీ వెల్లకిలాపడుకుని దుప్పటి కంఠం వరకూ లాక్కున్నాడు రావు. హాల్లో పిల్లల్ని నిద్రలేపుతోంది సుభద్ర. 'బాబ్జీ, అక్క ఇవాళవచ్చేస్తుంది. వేగిరంలే, సుందరం, నువ్వూ స్టేషన్‌కి వెళ్లొద్దూ. లే, పళ్ళు తోముకో, కాఫీ తాగు. మార్కెట్‌కు వెళ్ళాలి. అరటిపళ్ల గెల తేవాలి, లేలే !' ఊం ఒకటే హడావుడి చేసేస్తున్నది !

పక్కమీదినుంచి లేవబుద్ధి పుట్టటంలేదు రావుకి. నరాల్లో ఏవిటో వెచ్చగా, మత్తుగా శక్తిపాకుతోంది. వెలిసిపోయిన దుప్పటిలా, మాసిపోయిన తలగడలా, సుభద్ర గుర్తొస్తున్నది. పాలు పోయటానికి వచ్చిన పిల్ల మాలక్ష్మి ఎంత బింకంగా ఉంది! వీధివాకిలిపక్కనే ఆకులు రాలిపోయిన బావంచెట్టు కనబడుతున్నది. పై కొమ్మల్లోమాత్రం అక్కడక్కడ పండుటాకులున్నాయి. వరండాలో కంచుగంటలా ఎవరిదో గొంతు వినపడుతున్నది.

'అమ్మగారో, సుభద్రమ్మగారో'. రావుకి పక్కమీదనుంచి లేవాలనిలేదు. తన గదిలోంచి వరండాలోకి పోయే తలుపులు బార్లా తీసిలేవుగాని, పూర్తిగా వేసీలేవు. చూశాడు.

కూరల తట్ట దింపుకొంటోంది ఎవరో మనిషి. ఆడకూతురు. సుభద్ర వచ్చి చేయేసి సాయంచేసింది. పొరపాటుచేశాడు తాను. చప్పున పోయి తాను చేయివేయాల్సింది కూరల తట్టపైకి .పూర్తిగా పైట జారిపోయింది. మళ్ళా ఆ పైటను, కూరలమ్మి భుజాలమీద కప్పుకునేదాకా గుండె దడదడ కొట్టుకుంది రావుకు. పటువైనకొప్పు, కోక బిర్రుగా కట్టింది. పొట్ట దగ్గర ముడతలు లేవు. కళ్ళు నవ్వుతున్నాయి.

'బోణి మనింటికాడనే చేద్దామని వచ్చానమ్మా. మళ్ళా ఏరింటికైనా పోతే, తాజాసరకుకాదని మీరంటారు' అంటోంది. భుజాలమీద రవిక తడిసి చర్మానికి అంటుకున్నది. బయట జల్లులోంచి వచ్చిందామె. పైటతో ముఖం తుడుచుకుంది. శిలలో మలచినట్లుగా వుంది. సుభద్ర బేరాలూ సారాలూ చేస్తోంది. 'పసుకోండమ్మా, ఇంతలో నేను సెడిపోయేదిలేదు. ఈ ఇంటికాడ తిని బతికినదాన్నేను' అంటోంది. ఆ గొంతు ఎక్కడో విన్నట్లుగా వుంది. ఆ నవ్వు ఎక్కడనో చూసి

నట్లుగా వుంది. ఆ వాలకం ఎప్పుడో తన కళ్లపడ్డట్లావుంది. ఆశ్చర్యం. మంచందిగి ఆ మనిషిని పరకాయించి చూడాలనిపిస్తోంది రావుకు. సుభద్ర కూరల బేరం ముగిసింది. కూరలమ్మి తట్ట ఎత్తుకొని వెనక్కు తిరిగింది. రావు సిగరెట్ అవతల పారేసి లేచి కూచున్నాడు. 'కందిరీగ నడుముదాన, కాళ్ళ కడియాలదాన' ఎక్కడిదో ఈ పాట. ఈ భావం. తళుక్కున మనసులో స్ఫురిస్తుండగానే, కూరలమ్మి వరండా దిగి వెళ్ళిపోయింది. రత్తాలేనా? అన్న అనుమానంలో పడ్డాడు. వానజల్లు తెరిపిన పడ్డది. రావు వీధి వాకిట్లోకి వచ్చిచూశాడు. పనిమనిషి వాకిలి చిమ్ముతోంది. దూరంగా కూరలమ్మి, తన బరువో, తట్టబరువో, లయగా పిరుదులు కదలేట్లు వెళుతోంది. బావుండదని లోపల కొచ్చేశాడు రావు.

సుభద్ర కూరలన్నీ బుట్టలో కెత్తుతోంది.

'ఎంత ఖర్చుచేశావ్ పొద్దున్నే'.

'ఏం రాసుకోవాలా'

రావుకి చిర్రెత్తుకొచ్చింది. తానొక్కడే ఇంట్లో పిసినారివాడు. సుఖంగా, హాయిగా భారుభూరున బ్రతకలేడు. ఎవరికయినా బాధలేదు. తమ ఇష్టం వచ్చినట్లు తాము ఖర్చుచేస్తారు. స్వేచ్ఛగా, నిబ్బరంగా వుంటారు. తన ఒక్కడిదే సంసారమైనట్లు తనకే సంసారపు జాగ్రత్త అంతా. చిరాకునంతా అణచుకొని చిరునవ్వుతో—

'ఎవరీ మనిషి కొత్తగా వుందే' అన్నాడు యథాలాపంగా అడిగినట్లు, జాగ్రత్తపడుతూ.

'రత్తాలు తెలీదండీ. మన పెళ్ళినాటికి మనింట్లో పనిచేస్తుండేది'. రావు వెళ్ళి మళ్ళీ పక్కమీద కూచున్నాడు. దుప్పటి నిండా కప్పుకున్నాడు. సిగరెట్ వెలిగించాడు.

రత్తాలు. పచ్చగా, దబ్బపండులాగా, బొంగరంలాగా వుండేది. చీపురు పుచ్చుకుని గదులన్నీ శుభ్రం చేస్తుంటే నక్కి నక్కి వెనక వెనక తిరిగేవాడు తాను. కిటికీలోంచీ, అరుగుమీదినించీ, వంటింటి గడపమీద నుంచీ పులుకూపులుకూ చూసేవాడు తాను. పాతికేళ్ళక్రింద రత్తాలు కళ్ళు తనకళ్ళతో కలిస్తే ఎండకు కగ్గిన పువ్వుల్లా కళ్లు వాల్చేసుకునే వాడు. 'ఛా, నాకు సిగ్గు, ఇప్పుడా' అనేది రత్తాలు. తనకు భయం. అసహ్యం. చీదర. పెళ్లైంది. రత్తాలుకీ తరువాత పెళ్ళయిందట. రత్తాలును ఎప్పుడూ దగ్గరగా తాకలేదు. చూడలేదు. పాతికేళ్లనాటిమాట. ఆ రోజులు గుర్తు వచ్చినప్పుడల్లా తనమీద తనకే ఎన్నోసార్లు అసహ్యమయ్యేది. విసుగేసేది. కోపం కలిగేది. కాని తరువాత రోజులు గడిచి పోయినయ్. సంపాదన. పరువు. ప్రతిష్ఠ. పిల్లలు. చదువులు. ఉద్యోగాలు. పెళ్ళిళ్ళు-తనచుట్టూ గిరిగీసిన గీతలు.

సుభద్ర వచ్చి చూసింది, ఇదేం విడ్డూరమమ్మా! అన్నట్లుగా! "ఇవాళ ఇంకోసారి కాఫీ కలపను, త్వరగా తెములుతారా? తెమలరా". రావుకి విసుగొచ్చింది. సుభద్ర చేతులనిండా బొగ్గుమసి. ఆర్పేసిన కుంపటి లాగా వుంది. తనకు చలిగావుంది. గుండెల్లో వెచ్చగావుంది. నరాల్లో వింతగా వుంది. రావు లేచాడు. కాఫీతాగాడు.

కచ్చేరి గదిలో కూచున్నాడు.

ఇంకా రత్తాలే కళ్ళముందూ, కాగితాలముందూ కనపడుతున్నది. పెద్దకూతుర్నివాళ పెద్ద కుర్రాడు, అత్తారింటినుంచి తీసుకుని వస్తున్నాడు. సుభద్ర చేసే ఆర్భాటాని కంతా అర్థం అదే.

రేడియోలో తెలుగు వార్తలు వినపడుతున్నాయి. 'వాతావరణం పొడిగా వుండదు. ఆకాశం మేఘావృతంగా వుంటుంది. అడపా దడపా జల్లులు పడవచ్చు.'

సుందరం అప్పుడే స్నానం చేసి వచ్చాడులావుంది. 'అమ్మ పది రూపాయలిమ్మంటోంది' అంటున్నాడు, ఎదురుగా నిల్చుని. రావుకి చాలాకోపం వచ్చింది. తాను లక్షలు లక్షలు సంపాదిస్తున్నాడనీ, సంపాదిస్తాడనీ అనుకుంటోంది గాబోలు సుభద్ర. 'ఎందుకుట?' అన్నాడు విసుగ్గా. 'అరటిపళ్ళూ, తమలపాకులూ, చామంతిపూలూ, అగరొత్తులూ, పసుపూ, కుంకుమా' సుందరం లిస్టు చదివాడు. రావుకి బుర్ర వేడెక్కింది. నిన్న సాయంకాలం సుభద్ర బజారెళ్ళి రెండువందలు ఖర్చుపెట్టింది. నూటముప్పైఫరూపాయల చీరకొంది. అమ్మడు సూడిదలకు ఇంకా ఏమిటేమిటో అర్థంలేని ఖర్చులు. ఉడికిపోతూనే పదిరూపాయలనోటు ఇచ్చి పంపించాడు సుందరానికి.

సుందరం మళ్ళా అమ్మదగ్గరకు వెళ్ళాడు సంప్రతింపులకు. వాడట్లా వీధిలోకి వెళ్ళగానే సుభద్రవచ్చి, 'ఈ పూట వంట మనిషికి కబురెడదాము. లడ్డూలు కట్టించాలి' అంది. రావుకి చాలా కోపంవచ్చి కుర్చీలో కుతకుతలాడాడు. ఆ కోపంలో చేతిలో వున్న లా జర్నల్ వాల్యూము, అట్టలూడి చేతిలోకొచ్చి, పుస్తకం క్రింద పడిపోయింది. అట్టమీద సంవత్సరం చూశాడు. పాతికేళ్ళ క్రిందటిది. సుభద్ర వయసు— అప్పుడే వచ్చిందీవాల్యూముకు.

'సరే పిలిపించు.'

క్రిందికి వంగి పుస్తకం తీశాడు. ముసలివాసన వస్తోంది పుస్తకం. సుభద్ర లోపలకు వెళ్ళిపోయింది.

తనకు భయం. ఏమాటా తాను కాదనలేదు. అందరూ తనమీద అధికారం చెలాయించే వాళ్ళే. తను భీరువు. అసమర్థుడు. చేతకాని వాడు. పరువుప్రతిష్ఠలు, గౌరవమర్యాదలు, తనకు సంకెళ్ళు. ఉరులు.

అమ్మడు, రాజు, సుందరం, పద్మ, బాబ్జీ అందరూ తనపైని అధికారం చెలాయిస్తారు. తాను ధైర్యంగా, ఉద్రేకంగా, అతిశయంగా, దర్పంగా, తృప్తిగా చేసిన ఒక్కటంటే ఒక్కపని ఏమిటి ? ఎప్పుడైనా చేశాడా ? అవాళ ఒకరోజు రత్నాలు; నాన్నగారాఫీసుకు వెళ్ళి, అమ్మ పురాణానికి వెళ్ళి, మధ్యాహ్నం తన గదిపూడ్చేప్పుడు, తలుపు దగ్గరగా వేసి తనవేపు చూసి అదోలానవ్వితే, తనకు చెమటలు పట్టి, ఒణికిపోతే, తలుపు తీసి నవ్వుతూ వెళ్ళిపోలేదూ.

రావు మనసంతా ఇవాళ అదోలావుంది. చీవరగా, చికాకుగా, అసంతృప్తిగా.

రోజులానే పదింటికి కోర్టు కెళ్ళిపోయినాడు. పిండివంటూ, అదీ సాయంత్రానికిగానికాదు, అన్నది సుభద్ర. 'నా మొహాన ఏనీ పచ్చడి మెతుకులే కొట్టు' అనుకున్నాడు మనసులో రావు. మూడింటికి సుందరం కోర్టుకి కాఫీ పట్టుకొచ్చాడు. వాడి మొహం సినిమా కెళ్లేముందులా కళకళలాడిపోతున్నది. 'అక్కయ్యొచ్చింది నాన్నా, రైలు గంటలేటు. సాయంత్రం మనింటో పేరంటం. అక్కయ్యతో అత్తగారు కూడా వచ్చారు. అన్నయ్య బజారుకెళ్ళి చీరా, రవికా తెచ్చాడు. అక్క అత్తగారికి పెట్టాలట. మీరు క్లబ్బుకెళ్ళి ఏడుకో, ఎనిమిదికో రాండి' అని సుందరం పరిగెత్తుకుని వెళ్లాడు. రావు ఉస్సురని నిట్టూర్చాడు. అవాళ నిజానికి కోర్టులో పనికూడాలేదు. ఎక్కడికీ పోవాలనిపించలేదు. మధ్యాహ్నం లడ్డూలు కట్టివుంటారు. జిలేబీ చుట్టివుంటారు. చూశావా సుభద్ర తనను గుర్తించుకొని పంపనైనాలేదు— ఆడది, అతిశయానికి ముందో వెనకో పుట్టివుంటుంది. మగవాడు ఆమెకు బానిస. వాడి శక్తి నంతా హరించివేసి వాణ్ణి ఆడిస్తుంది. పెళ్ళితో మగవాడినోటికళ్లెం ఆడదాని చేతికొస్తుంది. అటు తరువాత యావజ్జీవమూ గుర్రం మగ వాడూ, సంసారం మోతుబరువూనూ—

ఐదు గంటలైంతరువాత ఎటు పోవాల్సిందీ తోచలేదు రావుకు. కోర్టు ఆవరణ దాటి బయటకు వచ్చిన తర్వాత ఒకరిద్దరు మిత్రులు పలకరించారు, క్లబ్బుకు ఆహ్వానిస్తూ. రావు హోటల్ కెళ్ళి స్వీట్ తిని కాఫీ త్రాగాడు. తన హక్కులేవో తాను గుర్తిస్తూ ఇప్పుడిప్పుడే నిలువుకొంటున్నట్లు అనిపించింది. క్లబ్బువేపు వెళ్లాడు. పేకాటంటే మోజులేదు అంటాడు ఇతరులతో. తనకు తెలుసు. తను పిరికి. తనకు భయం. తను పెద్ద సంపాదన పరుడుకాదు. గొప్పగా అనుభవించే సాహసం లేదు జీవితాన్ని. రెండుమూడు న్యూస్ పేపర్సు చూశాడు. న్యూస్ అంతా ఒక్కటే కాబట్టి, ప్రత్యేకంగా వ్యాపార ప్రకటనలు చూశాడు. ఒక బొమ్మ బాగా ఆకర్షించిందతణ్ణి. నడుము సన్నం దగ్గర కాకుండా, ఇంకా బాగా కిందికి చీరకట్టి, వీపు కనపడేలా వెనుతిరిగి విలాసంగా నిలుచుని ఈ చీరకట్టితే అందం, ఆనందం, స్వర్గం, సంతోషం, అంటోందో యువతి. పెద్ద కొప్పు. రత్నాలు జ్ఞాపకం వచ్చింది, చటుక్కున రావుకు. మనస్సంతా ఉసూరు మనిపించింది. ఎవరో పలకరించారు దూరంనుండి, లోకాభిరామాయణంలో కలవమని. రావు మనసుకి వాళ్ళతో చేరాలనిపించలేదు, ఇంటికి వెళ్లేందుకు లేదు. ఆ పకపకలూ, హాస్యాలూ, ముసలి ముత్తైదులూ, పసిపిల్లల వెక్కిళ్లూ, చీమిళ్ళూ, తాను భరించలేడు. ఆ చీరలు ఖరీదైనవేకాని, ఎందుకో తనకు నచ్చవు. అరచేతి మందం వెడల్పు జరీలూ, బోసిదవడలూ, పెద్ద పెద్ద బొట్లు. నెక్లెసుల గూర్చి, పెళ్ళిళ్ళను గూర్చీ, కడుపులను గూర్చి, కాన్పులను గూర్చీ, కోలాహలంగా మాట్లాడుకుంటూరు. అవే మర్యాదలు, అవే మన్ననలు. విసుగులేదు. వేసటలేదు వాళ్ళకు.

రావు చల్లగాలికి వూరి బయట దాకా నడచివద్దామని బయలు దేరాడు. ఆకాశం మేఘావృతంగా వుంది. వాతావరణం మనోజ్ఞంగా వుంది.

వూరి కోలాహలాన్ని తప్పుకుంటూ, నెమ్మదిగా వూరి బయటకు వచ్చేశాడు.

తన చిన్నతనంలో అక్కడ ఏడాదికి ఆరునెలలు టూరింగ్ టాకీస్ వుండేది. ఇంటర్ పాసై, బి. ఏ. లో చేరి ఒక సంవత్సరం గడిచిన దాకా, రహస్యంగా భయంభయంగా నేల టిక్కెట్టు తీసుకుని తాను సినిమాలు చూసే వాడక్కడ. ఇప్పుడక్కడ పర్మనెంట్ హాలు కట్టేశారు. చుట్టూ కిళ్లీబడ్డీలూ, న్యూస్ పేపర్ స్టాల్సూ, పకోడీలూ, ముంతకిందపప్పూ, నూనె మిఠాయిలూ అమ్మే చిన్న చిన్న దుకాణాలూ, చాలా సందడిగా వుంది అ ప్రదేశమంతా. ఇరుకువాడలూ, మురికిగోడలూ, పిరికినీడలూ వెకిలిజాడలూ, ఇప్పుడక్కడ. ఇంకా ముందుకు నడిచాడు రావు. మదన్ మోహన్ టాకీస్‌లో నుండి 'బృందావన మందరిదీ' అని కీచు గొంతుతో పాతరికార్డు గోల పెడుతున్నది. జనం పల్చగానే ఉన్నారు, సినిమాహాలుముందు. చిన్నతనాన, ముంతకింద పప్పు మెరపకాయబజ్జీలూ, అటూ ఇటూ చూసి, కొనేసి తినేసేవాడు. ఇప్పుడు నోరూరాయి కళ్ళూ కాళ్ళూ అన్నీ కట్టేసుకోవాలి. అన్యాయం. ఈ మెరపకాయ బజ్జీలమ్మే వ్యక్తి పాతికేళ్ళుగా అమ్ముతున్నాడు. ఇతని తండ్రి అమ్మేప్పుడు పక్కన వుండి పొట్లాలుకట్టి ఇస్తుండేవాడు. ఇప్పుడు తాను యజమాని అయినాడు. రావుకి మిరపకాయ బజ్జీలు తినాలనివుంది. కాని అశక్తతతో ముందుకి వెళ్లాడు. తన జరీకండువా, పైన తలపాగా వెక్కిరించాయి. బాగా ముందుకి నడిచి పొలాలమధ్య రోడ్డు పైకివచ్చేశాడు. అప్రయత్నంగా వెనుదిరిగి చూశాడు. సినిమాహాలుపైన లైటు ఉజ్జ్వలంగా కానవస్తున్నది నమో వెంకటేశా, నమో శ్రీనివాసా అని అరిగి అరిగి అరుస్తోంది లౌడ్ స్పీకర్ అనుకోకుండా ఆకాశంకేసి చూశాడు. చల్లనిగాలి, వర్షపువాసనను

మోసుకొచ్చి, శరీరాన్ని తాకింది. వానవచ్చేలాగుంది. తానేదో ధ్యాసలో ఇంతదూరం వచ్చాడు. వేగంగా వెనుదిరిగి నడవటం సాగించాడు రావు. సినిమా హాలునుంచికాక ప్రక్కగా ఊళ్లోకి దగ్గర దోవుంది. ఊళ్లోకి వస్తే రిక్షా అయినా దొరుకుతుంది. వడివడిగా నడుస్తున్నాడు రావు. ఊళ్లోకివచ్చి తాను ప్రవేశించిన సందుగొందులను తలచుకు సిగ్గుపడ్డాడు రావు. ఇంతలో చిరుజల్లు అతణ్ణి పరామర్శించింది. నిముషంలోనే వాన ఇంకా కొంచెం పెద్దదైంది. కళ్ళముందు రిక్షా కూడా కనరాలేదు.

చాలా ఇరకాటమైన పరిస్థితి. తాను చిన్నపిల్లాడిలా పరుగెత్తలేడు. తప్పలేదు. పక్కనేవున్న అరుగుల ఇల్లు చూరుకింద ఓరగా నిలుచున్నాడు రావు. అటూ ఇటూ చూస్తున్నాడు రిక్షా కోసం. ఆ వీధిలో ఎవ్వరూ నడవడం లేదు. ఎదురుగా చిన్న పెంకుటింటి వీధి తలుపులు తెరుచుకున్నాయి. 'బాబుగారూ రాండి. ఒక్క నిముషం కూచుని పోదురు' అని ఓరకళ్ళతో, ఒంటివిరుపుతో, గౌరవమో, అభిమానమో, రత్తాలు పిలుస్తున్నది. రావుకి కాళ్ళలోనూ, గుండెల్లోనూ దడ ప్రవేశించింది. రత్తాలు కన కళ్ళలో ఆంతు పెట్టిందో, కాంతు పెట్టిందో, రావులో తిరుగుబాటు ధోరణి, ఉద్రేకమూ, ధీమా కలిగాయి. అటూ ఇటూ చూశాడు. తన నక్కడ ఎవ్వరూ గుర్తుపట్టేవాళ్ళు లేరు.

చప్పున ఎదురునడచి రత్తాలువాళ్ళింట్లోకి వెళ్ళాడు. తాను పిరికివాణ్ణి కానని జీవితంలో ఒక్కసారైనా నిరూపించుకోవాలి. రత్తాలు పాతకుర్చీ చూపించింది. రావు కూర్చున్నాడు. కొంచెం దూరంలో నేలమీద చతికిలబడి కూర్చున్నది రత్తాలు. రావుకి ఏం మాట్లాడాలో, రత్తాలుకు ఏం మాట్లాడించాలో, అర్థంకావటంలేదు. ఊరినిండా దీపాలు వెలిగాయి. గొంగడిపురుగు సీతాకోకచిలకైనట్లుగా

సంజకాస్తా చీకటైపోయింది. రత్తాలు కొప్పునిండా చామంతిపూలు పెట్టుకుంది. అప్పుడే సాయంత్రం భోజనం అయిందేమో తాంబూలం కూడా వేసింది. ఆ గదిలో చౌకరకం సెంటువాసన కూడా వస్తున్నది. రావు శరీరానికి ఉక్కగావుంది. చెమటపడుతున్నది. గాలి ఆడుతున్నట్లు లేదు. తనకు రత్తాలుపైన కోర్కె వున్నట్లు సంజ్ఞలు ఎట్లాచెయ్యాలి ? ఒకవేళ రత్తాలు ఇష్టపడితే, తాను సంకోచం విడిచిపెట్టవచ్చునా ? ఈ ఒక్కసారి తాను ఏదో భ్రాంతితీర్చుకుంటే తన పరువుమర్యాదలకు భంగమా ? భ్రాంతి ఏం. సుఖమంటే రత్తాలుతోనే నిజమైన సుఖముం టుంది. పొద్దున్న నిద్రలేవగానే సుభద్ర రూపం గుర్తుకొచ్చింది రావుకు.

రత్తాలు అదోలా చూసింది రావును. రత్తాలుతో ఏమనాలో తోచటంలేదు రావుకు. ఒకవేళ తాను లేచిపోయి రత్తాలు చేయిపట్టు కుంటే, తననిగూర్చి ఏమనుకుంటుందో రత్తాలు. లోపల ఈసడించు కుంటుందా ? లోకువకడుతుందా ? అయ్యగారూ, ఇదేంటి అంటుందా.

రావుకు ముచ్చెమటలు పోస్తున్నాయి. చెవికింద దోమ ఏదో పరామర్శించి సంగీతం పాడుతూ వెళ్ళింది. వీధి వాకిటి మురికికాలువ వాసనకూడా పలకరించిపోయింది. రత్తాలు పైట జారినా మళ్ళీ తీసుకోలేదు.

బాత్‌రూంలో, రంగనాథం, గ్రంథసాంగుడేనోయ్, ఏమో ఏమో ననుకున్నాం, అని తోటి లాయర్లు చెవులు కొరుక్కుంటున్నట్లూ, మర్రోజు పొద్దున్నే రత్తాలు కూరల తట్టతో వచ్చి, తననిచూసీ, సుభద్రను చూసీ—ఓసి నీ ధీమా నాకు తెలీదా అని భావగర్భితంగా నవ్వినట్లూ. రావు వణికిపోయినాడు.

'ఈ ఊరెప్పుడొచ్చావు ?' అన్నాడు పొడిగా, నిస్సారంగా, తాను నిజంగా పెద్ద మనిషే సుమా అని హెచ్చరిస్తూన్నట్లు. ఇంకా

లోపల భయం పీకుతున్నది. మొగుడూ మొద్దులూ ఏమైనట్లు. లేక ఎవరైనా తలుపుతోసుకునివస్తే. తాను వెనకవచ్చాడు. తలుపు తానైతే వేసిరాలేదు.

'నెలరోజులైంది' అన్నది రత్తాలు. పొడిగానే.

'నీ మొగుడేం చేస్తాడు ?'

రత్తాలు నిర్లక్ష్యంగా నవ్వింది. 'ఓయ్ ! నా పెళ్ళిసంగతి మీకు గుర్తుందే. ఆడు లారీ డ్రైవరు. తాగితాగి యాగ్సిడెంలై చచ్చాడు. ఈడ యీరసామని గుర్రబ్బండాడుండేవాడు. ఆణ్ణి సాయం చేసుకున్నాను కొన్నాళ్ళు. అడితో ఆఊరు, ఆఊరూ తిరిగాను. ఆడెవత్తినో మరిగి, ఒకటి రెండుసార్లు, చేయిచేసుకొన్నాడు. 'ఓరి ఎదవనాయాలా, నీవేపటి నాకుదిక్కు' అని ఒగ్గేశానాణ్ణి. ఏమైనా పుట్టి పెరిగినూరు, మమకారంపోక, యీడికే జేరా. మా అమ్మ కాలంజేసెగా. ఈ ఇల్లు ఐదు రూపాయలద్దె. కూరలమ్మితే నా బతుకు గడవదా అని యీ యాపారం మొదలుచేశాను. ఇదీ కుదరకపోతే మానేత్తా. నాకేం పరువా ప్రతిట్టా, పిల్లా పాపా ?! మొగుడా మొద్దులా. సిగ్గా, శరమా, నేనడవిలో చెట్టును. ఎండా, గాలీ, వానా, వాగూ, వంటిదాన్ని.

రావు అడిగాడు. 'వాన తగ్గిందా ?

ఓరగా చూసింది రత్తాలు. 'బిరాన ఇంటికెళ్ళాలా ?'

రత్తాలు నవ్వింది. 'సిన్నప్పటి బయంపోలేదు'.

రాజుకు తల కొట్టిన ట్లనిపించింది. తన బ్రతుకు, పార్కులో పదిరోజుల కోసారి మాలి కత్తిరించివేసే కాగితపు పూలచెట్టు లాటిది. తన ఇష్టం వచ్చినట్లు తాను గాలీ, ఎండా, వేడీ, వెల్తురూ, చూసేందుకు లేదు. ఏ పని చేసేందుకులేదు. పరువుప్రతిష్ఠలు, మానమర్యాదలూ,

కృత్రిమమైన సాంఘిక నియమాలు, సాలీడుదారాలు. తనకు ఏభై అన్నా నిండకముందే ముసలితనం వచ్చేసింది. సుభద్రకు నలభై దాటి మూడు నాలుగేళ్ళన్నా గడవకముందే, చప్పి దవుడలూ, ముసలి నవ్వులూ, ముడతల ఒళ్ళు. లోతైన కళ్ళు. రత్తాలు చూడు. దిబ్బరొట్టెలా ఉన్నది. ప్రకృతి సిద్ధంగా ఏ నియమాలకు, ఏ కృత్రిమమర్యాదలకూ తల ఒగ్గకుండా ఏటి ఒడ్డున చెట్టులా, అడవిలో పారే ఏరులా, అందమైన కొండలా స్వేచ్ఛగా, తృప్తిగా బ్రతుకుతోంది రత్తాలు. ఆకాశంలా, భూమిలా, రత్తాలు వయసొచ్చినా, బిగువుగా, బింకంగా బిర్రుగా వుంది. ఛీ, తానూ మనిషేనా. బ్రతుకంతా భయమే. అడుగడుగునా ఆత్మవంచనే. ఒక్కసారి సుఖంకోసం కాకపోయినా, తన పిరికితనాన్ని తోసిపారేసేందుకైనా రత్తాలును తావాలి. అని ఒక అల.

రావుకి కళ్ళముందు అనేక దృశ్యాలు. పురిటిగదిలో సుభద్ర. పెద్దకొడుకు టైఫాయిడ్. కూతురుకు చిన్నపిల్లచేష. మళ్ళీ నీతి. సంఘం. పెద్దమనిషి. పిల్లలతండ్రి.

రత్తాలు అపహాస్యంగా నవ్వుతున్నది. బయటవాన నిలిచింది. తాను ఇప్పటివరకూ తన ప్రజ్ఞ కాకపోయినా, సమయం, సందర్భం కూడకనో, ఏమో, ఇంకో స్త్రీని ముట్టలేదు. ఇప్పుడు ఏభైలో పడుతూ ఛీ, నీ జన్మ ఎప్పుడూ ఇంతే. నీ పిరికితనం ఇంతా అంతా కాదు. అని మనస్సు ఎత్తి పొడుస్తున్నది. ఒక్కసారి ఇప్పుడు, ఏం ఏమైతే—అని ఇంకో అల.

రావు లేచాడు.

రత్తాలు లేచింది. రావు చూశాడు. ఒణుకుతూ బిడియపడుతూ 'తలుపు' అని నీళ్ళు నమిలాడు.

రత్తాలుకు జాలైంది. 'అయ్యగారూ!' అన్నది సానుభూతి ధ్వనించేట్లు. రావుకి తల తిరిగిపోయింది.

'ఇవాళ పెద్దమ్మగారికి పసుపు కుంకుమ చేత్తుండారట. ఆ యమ్మను నేను ఎత్తుకొన్నాను. అదుట్టం. అయ్యా, పున్నెం జేత్తే బతుకు పండుతుంది.' రావు రత్తాలువేపు నడవలేకపోయినాడు. రత్తాలు తలుపు దగ్గరకు నడిచింది. అయితే రావు తలవంచుకుని తలుపుదాటిన తరువాత తలుపులు మూసింది.

ఆ వీధిన ఎవరైనా తనకు ఎదురైతే. అని తల వంగిపోతున్నది రావుకు. శరీరమంతా అలసిపోయింది. సోలిపోతోంది. అసహ్యం, ఏవగింపూ. తనమీదే తనకు, ఎందుకో. తన పిరికితనాన్ని తలచుకొనీ. తన భయాన్ని తలచుకొని. తన సంసారమంటే ఏవగింపు కలుగుతున్నది.

అందరికీ తాను, సంతోషం, సౌఖ్యం, ఆలనా, పాలనా, రక్షణా కల్పించేవాడు. తాను వాళ్ళకు గాఢంగా కావలెనో! వద్దో.

ఇంట్లోకి వెళ్ళి తనగదిలో కూచున్నాడు.

ఎవరితో మాట్లాడాలనిపించలేదు. పేరంటాళ్ళందరూ వెళ్ళినట్లున్నారు.

సుభద్ర వచ్చింది. చేతిలో చిన్నపళ్లెంలో ఏదో టిఫిన్ తీసుకుని. సుభద్రవేపు విచిత్రంగా చూశాడు రావు.

'మీరు మధ్యాహ్నం కూడా సరిగా భోజనం చేయలేదు'.

పెద్దబాబు, గదిలోకి పరిగెత్తినట్లుగా వచ్చి, 'నాకు ఫస్ట్‌క్లాస్ వచ్చింది. నాన్నారూ' అన్నాడు. 'ఇందాక మా రామం-కు వాళ్ళన్నయ్య టెలిగ్రాం ఇచ్చాడు. యూనివర్శిటీనుండి.' పెద్దబాబు ఇక అక్కడ క్షణంవుండలేదు.

సుభద్ర దగ్గరగావచ్చి 'స్నానం చేయండి. బాగా అలసిపోయినట్లున్నారు. అమ్మడు మీగూర్చి వందసార్లడిగింది.

రావు మనస్సు ఎందుకో ఆర్ద్రమైపోయింది.

రత్తాలు ప్రకృతిలా యథేచ్ఛగా ఏ నియమాలకు, నిబంధనలకూ తననుతాను బంధించుకోక, స్వేచ్ఛగా బ్రతుకుతున్నది అదృష్టవంతురాలనీ, ఇవాళ ఇంతకుముందు తాననుకున్నాడా? లేదా? రత్తాలు బ్రతుకులో పెద్దబాబు సంతోషం, అమ్మడి అభిమానం, అనుభవానికి వచ్చేనా—

అయ్యో, ఇవాళ ప్రొద్దుటునుంచీ తానెంత దిగజారిపోయినాడు, తన మనస్సూ శరీరమూ అలసిపోయినాయి. ఇరుకైపోయినాయి. మురికైపోయినాయి.

స్నానం చేసి, సిగరెట్ కాల్చుకుంటూ, కాసేపు సేదదీర్చుకుంటే కాని మళ్ళీ తాను, తానుకాలేదు.

రావు లేచి హాల్లోకి వెళదామని కదిలాడు, పరధ్యానంగా. తనకళ్ళు వాస్తవమైన విషయాన్నే చూస్తున్నాయా? తన కన్నతల్లి, తన నెత్తురు, తన అమ్మడు బరువుగా, భారంగా, పెద్ద పూలజడతో, అలుపుతోకూడిన నవ్వుగలతృప్తితో తన కాళ్ళదగ్గరవంగి నమస్కారంగా తాకుతున్నది తన పాదాలను.

సిగ్గుగా, బరువుగా, లోపలకు వెళ్ళిపోయింది.

రావు క్షణంసేపు కాలుకదల్చలేక, తరువాత చెమ్మగిలిన కళ్ళను చేతులతో తుడుచుకున్నాడు.

తాను పిరికివాడైతే ఫరవాలేదు. అల్పుడుకాకుండా ఉంటే అదే చాలును. జీవితంలో ప్రతివిషయాన్నీ ఆవైపూ, ఈవైపూకూడా చూడాలి. ప్రతివస్తువుకూ, అటువైపూ, ఇటువైపూ ఉండితీరుతాయి; అవతలివైపు కూడా చూసినవాడే అచ్ఛమైన నిజాన్ని తెలుసుకోగలుగుతాడు.

# కథ నాదీ - ముగింపు ఆమెదీ

శీలా వీర్రాజు

'నీతో ఓ విషయం మాట్లాడాలి. రేపు ఓసారి రారాదూ' అంది సావేరి. తిరుగులేని ఆయుధం అది. స్త్రీ మాట్లాడాలి రమ్మంటే రానని పురుషుడెవరూ నాకు కనిపించలేదు. ఎంత బెట్టుసరిచేసేవాడైనా ఏ స్త్రీ అయినా అలా వొచ్చి పిలుస్తే వెళ్ళకుండా వుండడు. ఆ విషయం స్త్రీకి బాగా తెలుసు. పురుషుడ్ని తన దగ్గరికి రప్పించుకోవాలనుకుంటే స్త్రీ ఉపయోగించే ఆయుధాల్లో యిదొకటి.

ఇదే ఆయుధాన్ని ఏ పురుషుడన్నా స్త్రీ మీద ప్రయోగించాడనుకోండి. 'ఏమిటావిషయం! ఇక్కడ చెప్పగూడదేమిటి? పోనీలే, అంత పరమరహస్యమైతే అది నీదగ్గరే అట్టేపెట్టుకో, నాకంత తీరిక లేదుబాబూ' అంటూ తీసిపారేస్తుంది. అయనే తన దగ్గరకివొచ్చి మరీ

ఆ విషయం చెప్తాడని ఆమెకు తెలుసు. అందుకే ఆమెకు ఆ బెట్టుసరి. ఆమె ఆ బెట్టుసరి చేస్తున్నట్టు పురుషుడు గుర్తించినా అది ఆమెకు అందాన్నే యిచ్చిందిసుమా అని మురిసిపోతాడు. ఆమెను తను పిలిచిన విషయం మర్చిపోయి, తనే ఆమె దగ్గరకి వెళ్తాడు.

సావేరి ఎందుకు రమ్మందో నాకు తెలుసు. చూచాయగా అంతకుముందే విన్నాను. దశావతారాన్ని ప్రేమిస్తోందట. బహుశా ఈ విషయంలో నా సలహాను కోరడానికే అయివుండొచ్చు. నిజానికి ఇలాంటి వాటిలో సలహాలివ్వడం అంత మంచిదికాదు. ఒకవేళ ఇచ్చినా ఇవ్వనట్టే మర్చిపోవడం అవసరం.

ఏ వ్యక్తయినా పనిగట్టుకొని నీ దగ్గరకొచ్చి తన ప్రేమ కథంతా చెప్పుకుని నీ సలహా అడిగితే నువ్వెంతో మురిసిపోయి, నిన్నంతగా గౌరవించేస్తున్నాడనుకొని సంబరపడిపోతావు. కాని, నువ్వొట్టి అమాయకుడివిసుమా. నీ సలహాని అతను పక్క జేబులో పెట్టుకుని తొడుక్కున్న బట్టల్ని విప్పేవరకూ అలాగే వుంచుకుని తిరుగుతూ, జ్ఞాపకం వొచ్చినప్పుడు ఓ మారు పైకితీసుకుని చూస్తూ, మళ్ళీ జేబులో పెట్టుకుని, మళ్ళీ తీసి, మళ్ళీ పెట్టి-అలా అది మడతలుపడి చిరిగి శిధిలావస్థ చేరుకుంటే విసుగేసి ఎప్పుడో నిర్దయగాతీసి అవతల రోడ్డుమీద పదిమందీ వొచ్చిపోయే నేలమీదకు నిర్లక్ష్యంగా విసిరేస్తాడు. అందుకే యితరుల ప్రేమ విషయంలో నువ్వు సలహా ఇచ్చేప్పుడు దానం చేస్తున్నట్టు సంతోషపడిపోక, పారేసుకుంటున్నట్టు దిగులుపడు.

నేనుకూడా ఇంతవరకూ యిలాంటి విషయాల్లో ఎవరికీ సలహాలు ఇవ్వలేదు. ఒకవేళ సావేరి ఇందుకే పిలిచినా నాకేం తెలీదని చెప్పి తప్పించుకోవాలనుకున్నాను.

సావేరి రమ్మన్నదని కాకపోయినా చుట్టపు చూపుగానన్నా వాళ్ళింటికి వెళ్ళకపోతే బావుండదని మర్నాడు వెళ్ళాను.

'నువ్వు వస్తావో రావోనని సాయంకాలంపూట నేనే ఓసారి వచ్చి పోదామనుకున్నాను. నువ్వేవచ్చావు. యింకా నీకు నా మీద గౌరవం వుందన్నమాట' అంది సావేరి.

ఆ గౌరవం ప్రస్తావన ఆమె ఎందుకు ఎత్తవలసి వచ్చిందో ఆ విషయం ఆమెకూ, నాకూ మాత్రమే తెలుసు.

'పెళ్ళికి నువ్వొస్తున్నావని మా తమ్ముడు చెప్పాడు. అసలు, వేణుగోపాలం గారికి అల్లుడ్ని వెతికి పెట్టిందికూడా నువ్వేనటగా. ఈ పెళ్ళికి తప్పకుండా నువ్వొస్తావనే అనుకున్నాను. ఈ విషయం తెలిసాక నిజంగా నాకు ప్రాణం లేచొచ్చిందనుకో !' అంది సావేరి.

ఇంతకు ముందయితే ఈ మాటలకి నేను చాలా అర్థాల్ని కల్పించుకుని వుండేవాడిని. ఒకసారి సావేరే అవన్నీ సరికావని చెరిపేసింది. చిన్నప్పుడు పద్యాలకు ప్రతి పదార్థం రాయాల్సివొచ్చినప్పుడూ ఇంతే. నాకు సరిగా చేతనయ్యేదికాదు. మూడొంతులు తప్పులే రాసేవాడిని సావేరి నా నోట్సు తీసుకుని తప్పుల్ని కొట్టిపారేసి సరైన అర్థాల్ని రాసిచ్చేది. అందుకే ఆమెకు ప్రతిసారీ పరీక్షల్లో తెలుగులో ఫస్టుమార్కో సెకండ్ మార్కో వస్తుండేది.

'భావనగర్ బాగానే వుంటుందంటగా, ఎప్పుడైనా వస్తే ఆతిథ్యం యిస్తావా ?' అంది.

ఏమిటో ! మరీ కాలక్షేపం మాటలివి. ఆమె రానూరాదు. వస్తే నేను ఆతిథ్యం ఇవ్వకుండా వుండనూ వుండను.

నే నేమీ మాటాడలేదని కాబోలు తిరిగి 'అబద్ధంకాదు. నిజంగానే వద్దామనుకుంటున్నాను. నిన్ను పిలిచిందికూడా అందుకే' అంది.

'అలాగే. తప్పకుండా రా. నాకైతే వంటరాదు, నువ్వే చేసిపెట్టాలి మరి' అన్నాను.

చాలాసేపు సావేరి మౌనంగా వుండిపోయి ఓసారి అటూ ఇటూ చూసి మెల్లగా 'నీతో ఓ ముఖ్యమైన పనిపడింది, చేసిపెట్తావా ?' అంది.

నేను వూహించింది అబద్ధంకాలేదు. ఇంత రహస్యం కళ్ళల్లోనూ, కంఠంలోనూ ఎందుకో నాకు తెలుసు. ఈ తెరవెనుక హృదయాన్ని చదవగలను. తన ప్రేమ విషయం చెప్పుకుని నా సలహా యేమిటో అడగడానికే అయివుంటుంది. ప్రేమించడం తప్పేమీకాదు. ప్రేమ జీవితాన్ని అర్థవంతం చేస్తుంది, చైతన్యమయం చేస్తుంది. ప్రేమ అక్కర్లేని మనిషెవరు ? అమధ్య పత్రికల్లో చదివాను, చైనాలో ప్రేమ నిషిద్ధమట. ప్రేమ పనికిరాదంటుంది చైనా. దానివల్ల పారిశ్రామికోత్పత్తిలో మాంద్యం యేర్పడుతుందట. కాని, ప్రేమలేందే కరుణ లేదు. ప్రేమలేందే జాలిలేదు. అది మనసును వెన్నలా మెత్తబరుస్తుంది. మనసు మృదువుగా వుంటేనే బాధా, శ్రమా అర్థమౌతాయి. బాధితుల యెడ సానుభూతీ, జాలీ కలుగుతాయి. వాళ్ళ కన్నీళ్ళను తుడవడానికి చెయ్యి అందివ్వమంటుంది ప్రేమ. చుట్టూ నిక్షిప్తమైవున్న అందాన్ని గుర్తింపజేస్తుంది. దానివల్ల మనసుకు ఉల్లాసం కలుగుతుంది. శ్రమను మరిచిపోయే మానసిక బలం చేకూరుతుంది. ఉత్తేజం కలుగుతుంది. రెట్టింపు ఉత్సాహంతో యే పనైనా చేపట్టవచ్చు. అలాంటప్పుడు పారిశ్రామిక ఉత్పత్తులు కుంటుపడతాయన్న చైనా వాదానికి తావులేదు. ప్రేమించలేని మనసు హత్యచెయ్యడానిక్కూడా జంకదు. జాలీ, కరుణా లేనప్పుడు, చిత్తశాంతీ, మనోల్లాసమూ లేనప్పుడు,

సౌందర్యారాధనా, రసదృష్టీ లేనప్పుడు కోపమూ, అసహ్యమూ, అస హనమూ వచ్చి చేరతాయి. కోపం, అసహ్యం, అసహనం ఉన్నచోట అశాంతి ప్రబలుతుంది. దారుణాలు జరుగుతాయి. హత్యలు జరుగు తాయి. అశాంతీ, భయం వ్యాపించినచోట ఉత్పత్తి సక్రమంగా సాగదు. పారిశ్రామికోత్పత్తిలో మాంద్యం యేర్పడుతుంది. కనుక, చైనా వాదన అర్థరహితమైనది.

'అంతసేపు ఆలోచిస్తున్నావేమిటి ! చేసిపెట్టడం యిష్టంలేదా ?' అంది సావేరి.

ఆమె చెప్పే సంగతేమిటో తెలుస్తూనే వున్నా ఆమె నోటిమీద గానే విందామని అసలు విషయమేమిటో చెప్పమన్నాను.

'మీ వూరు వస్తాను. కొంతకాలంపాటు వుండనిస్తావా ?' అంది.

ఇదా యీమె చెప్పదలచినది! ఈ మాత్రందానికి యేదో పెద్ద రహస్యం చెప్తున్నట్లు ప్రవర్తించిందేం !

'ఏం, మాట్లాడవేం. నేనువస్తే ఆ మాత్రం వుండనివ్వవా ?'

'లంకంత పోర్షను, హాయిగా వుండొచ్చు. ఇంతకీ నువ్వు నిజంగా వస్తావా' అన్నాను అనుమానాన్ని ప్రకటిస్తూ.

ఆమె వింతగా మాట్లాడడం ఆశ్చర్యంగావుంది. ఏమిటో, నాకు యిప్పటికీ సావేరి అర్థంకాదు. అయినా యితరులు మనకి అర్థంకాలే దనుకోవడం పొరపాటే, చాలాసార్లు మనకి మనమే అర్థంకాము కదా !

'చూసేవా ! నా మాటల్ని యేమాత్రం నమ్మలేక పోతున్నావు. అంత నమ్మలేనిదాన్నయిపోయానా నేను' అంది. ఆమె కళ్లచుట్టూ తడి, ఆమె కంఠంచుట్టూ దుఃఖం అంటుకుంది.

ఇదిగో ! ఇలాంటి కంఠంతోనే ఆమె జయించుకొస్తోంది. ఇంట్లో సవతి తల్లి. అందుకే ఆమెకు కన్నీళ్ళూ, దుఃఖంతో తడిసిపోయిన కంఠమూ సర్వసాధారణమైపోయాయి. ఒకసారి నన్నుకూడా ఇలాంటి కంఠంతోనే జయించింది. జీవితంలో నేను ఎప్పుడూ యే విషయంలోనూ పరాజయం పొందలేదు– అదిగో అదొక్కటే. తట్టుకోలేక గిలగిల్లాడాను. ఒడ్డున నిలుచుని బయట పడేసిన చేపను చూసినట్టు సరదాగా చూస్తుంటే నేనే ఆమె ఎదుటినుంచి తప్పించుకుని దూరంగా వెళ్ళిపోయాను.

సావేరి యేదో చెప్పబోయి ఆగిపోయింది. ఇటువైపు అడుగుల శబ్దం వినిపిస్తే పక్కకు తిరిగాను. సావేరి సవతి తల్లి. గుర్తుపట్టి పలకరించింది. 'అందరికీ పెళ్ళిళ్లు చేయిస్తున్నావుగాని నువ్వెప్పుడు చేసుకుంటావోయ్' అంది. ఆమెకు నేనంటే మొదటినించీ అభిమానమే. బహుశా యీ అభిమానంవల్లనేగాబోలు సావేరి నాకు దగ్గరగా రాలేకపోయింది.

ఆమె అవీ ఇవీ మాటాడి లోపలికి వెళ్ళిపోతూ 'ఆ వేణుగోపాలం గారంత చేయలేకపోయానటయ్యా నేను' అని ఓ విసురు విసిరింది.

నిజమే. అంతకన్నా దగ్గరి బంధువే మరి. కాని, వేణుగోపాలం గారికి సహాయం చేసినట్టు నేను యీమెకి సహాయం చేయగలనా ? అంత నిస్స్వార్థ పరుడ్నికాను. సావేరి ఒకసారి యేదో విషయంలో అననే అంది–నీలోనూ స్వార్థం వుంది, లేకపోతే నువ్విలా మాట్లాడి వుండవు– అని. ఔను. అప్పుడు నేను స్వార్థపరుడ్నే. అప్పుడే కాదు యిప్పుడు కూడా.

'ఏమిటి ! యేదో దీర్ఘాలోచనలో పడ్డట్టున్నావ్. చెప్పవేం మీ వూరు వచ్చేదా ?' అంది సావేరి.

ఆమె సరదాకి అడగడంలేదని, సీరియస్‌గానే అడుగుతోందని అర్థమైంది.'

'ఈ మాత్రందానికి నన్ను అడగాలా. అడగక్కరలేకుండా తిన్నగానే రావొచ్చు నువ్వు. ఆ మాత్రం చనువు నీకులేదూ?'

"ఉందనుకో, అయినా అడగడం మంచిదికదూ. అనవసరంగా నిన్ను ఇబ్బందిపెట్టడం అవుతుందేమోనని అడిగాను. ఇంతకీ నేను రావడంవల్ల నీకు యేమైనా యిబ్బంది కలుగుతుందా?"

"అలాంటిదేమీ లేదు"

"మరి ఎవరైనా నన్నుగురించి అడిగితేనో?"

అవును ఎవరైనా అడిగితే...ఆలోచిస్తున్నాను.

"సరేలే. నువ్వేం చెప్పుకున్నాసరే, నాకు మాత్రం కొంతకాలం ఆశ్రయమియ్యి" అంది సావేరి.

కాలేజీనించి సావేరి తమ్ముడు వచ్చాడు. సావేరి అక్కడ్నించి లేచి వెళ్లిపోయింది. వాళ్ళ తమ్ముడితో మాట్లాడుతున్నానన్నమాటేగాని నా ఆలోచనలన్నీ సావేరినిగురించే. దశావతారాన్ని గురించి చూచాయగానన్నా యేమీ చెప్పలేదేం? విలన్‌ని చూసినట్టు ఎందుకలా చూడాలి నన్ను?

ఎంతసేపున్నా సావేరి తమ్ముడు కదల్లేదు. వెళ్ళిపోదామని లేచాను. వాళ్ళమ్మతోకూడా చెప్పి బయలుదేరబోతుండగా సావేరి వచ్చి "నేను చెప్పిన సంగతి మర్చిపోవుకదూ, పెళ్లింతర్వాత ఆ ఉద్యోగంగురించి గట్టిగా ప్రయత్నించు. అప్లికేషన్ పెట్టమంటే తర్వాత పెడ్తాను. ఉత్తరం రాయి, ఇదిగో అడ్రసు" అని ఓ కాగితం యిచ్చింది.

నేనింకా ఆశ్చర్యంనుంచి తేరుకోకుండానే అక్కడ్నించి వెళ్ళి పోయింది.

అడ్రసు యివ్వడమేమిటి, తెలీనట్టు! కాగితం విప్పాను. అడ్రెసు మాత్రింకాదు! మడిచి జేబులో పెట్టుకుని హడావిడిగా వీధిలోకి వచ్చాను. వీధి చాలా పొడుగ్గావుంది. ఉత్తరం చదవడానికి వీల్లుండదు. సావేరితల్లికో, తమ్ముడికో కనిపించొచ్చు. ఆ కాగితం యిస్తున్నప్పుడు వాళ్ళు అక్కడే వున్నారు.

కాగితంలో యేముందో తెలుసుకోవాలని ఆత్రుతగా వుంది. ఎప్పుడో సావేరి అంది — నేను స్వార్థపరుడ్నని. అవును. ఆ స్వార్థం నాలో ఉన్నట్టు ఇప్పుడు స్పష్టంగా తెలుస్తోంది. అందుకే అర్థంలేని యీ పిచ్చి ఆనందం.

ఎదురుగా రిక్షా వస్తోంటే బేరం చెయ్యకుండానే ఎక్కి కూచు న్నాను. కాగితం తీశాను.

"ఇంట్లో చాలా విషయాలు చెప్పడం కుదరలేదు. చిన్న పని చేసిపెట్టు. నువ్వు ఉద్యోగం చేస్తున్నచోటే ఓ టైపిస్టుపోస్టు వుందనీ, అప్లికేషన్ పెట్టమనీ నా పేర ఓ ఉత్తరం రాయి. అది చూసుకుని సర్టిఫికెట్లన్నీ నీకు పంపిస్తాను. వారంరోజులతర్వాత ఉద్యోగం వచ్చిం దనీ, వెంటనే వచ్చి చేరమనీ వుత్తరం రాయి. బయలుదేరి వస్తాను. నీతో చెప్పాల్సిన విశేషాలు చాలా వున్నాయి."

ఆ ఉరకలూ పరుగులూ యిప్పుడులేవు. పాలపొంగులాగ అయి పోయింది. ఇన్ని నీళ్ళు చిలకరించిందీ వుత్తరం. స్వార్థం కళ్ళల్లో దుమ్ములాగ యీ నీళ్లు.

"కుడివైపా ఎడంవైపా బాబూ?"

"కుడీలేదూ ఎడమాలేదూ. ఆపెయ్" దిగిపోయి చిల్లర డబ్బులు చేతిలో పెట్టి బయలుదేరాను. చికాగ్గా ఉంది. ఇంటికొస్తే సావేరి కనీసం కాఫీనీళ్ళన్నా యివ్వలేదుకదా.

హోటల్‌కి వెళ్ళాను. వెధవ కాఫీ, పాతిక పైసల కాఫీయేనా యిది వట్టి నీళ్ళకాఫీ. సర్వర్‌ని కసురుకుని వీధిలో కొచ్చాను. ఇంత దుమ్ము కళ్ళల్లో కొట్టివెళ్ళింది ఓ లారీ. ఛీఛీ, యేం రోడ్లో. నడవడానికి కూడా వీల్లేదు. దగ్గర్లో పార్కువుంటే వెళ్ళి కూచున్నాను. చల్లగా ఉంది. మైక్‌లోంచి వెండితీగను జలతారుపోగులాగ సాగదీస్తున్నట్టు అసావేరిలో సన్నగా వైలిన్ సంగీతం వస్తోంది.

సావేరి ప్రవర్తన యేమిటో విచిత్రంగా ఉంది. దశావతారం నుంచి దూరంగా ఎందుకు పారిపోతున్నట్టు? సావేరి తనను ప్రేమిస్తున్నదని దశావతారం ఎవరితోనో చెప్పినమాట నిజంకాదా? అది కేవలం స్వోత్కర్షేనేమో. తన గొప్పతనాన్ని చాటుకుందుకు యీ అబద్ధాన్ని ఓ అలంకారంగా తగిలించుకున్నాడేమో. ఒకవేళ ఆమె అతన్ని ప్రేమించినా ప్రేమించి ఉండొచ్చు. ప్రేమ ఉప్పులాంటిది. అది విడిగా ఎందుకూ పనికిరాకపోవచ్చు. కాని అది లేందే జీవితానికి రుచేలేదు. చిన్నప్పటినించీ సావేరి జీవితం నిస్సారంగానే గడిచింది. దశావతారాన్ని ప్రేమించివుంటే అందులో వింతేమీలేదు. వింతగా అనిపించే విషయం ఒకటే. ఆమె ప్రేమించే హృదయాన్నే కోరుతూ వుంటే, అంతకుముందు అలాంటి హృదయాన్ని ఎందుకు తిరస్కరించింది? దశావతారమంటే అంత ప్రత్యేకమైన అభిమానం ఉన్నప్పుడు యిప్పుడిలా పారిపోవడం దేనికి?

దశావతారమే ఆమెను తిరస్కరించి ఉండొచ్చు. అవును. ఆమె కళ్ళలో గిలగిలా కొట్టుకుంటున్న చూపులూ, ఆమె ముఖంలో ఎగిరి పడుతోన్న బాధా, రెపరెపలాడుతోన్న ఆందోళనా, మాసికలుపడ్డ మసిగుడ్డలాటి ఉత్సాహం—యివన్నీ ఆ సంగతే చెప్తున్నాయి. వెనక యిలాంటి స్థితిలోనే నేనూవుండి యిలాగే పారిపోయానుకదా.

సావేరిమీద జాలేసింది. పాపం! ఎప్పుడూ ఆమె జీవితం సవ్యంగా గడవలేదు. అన్నీ వంకర గీతలే.

చీకటి పడేవరకూ పార్కులోనే కూచుని యింటికి వెళ్ళాను. భోంచేసి పడుకునేముందు ఎంత వొద్దనుకున్నా గతం గుర్తుకొచ్చింది.

మర్నాడే వెళ్ళిపోయాను. వెళ్ళేముందు సావేరిని కలుద్దామను కున్నాను గాని అంతకుముందే అప్పగింతలన్నీ అయిపోయాయికదా, యింకెందుకు లెమ్మని కలవలేదు. ఊరువెళ్ళిం తర్వాత ఆమె కోరినట్టే ఉత్తరం రాశాను. ఏవేవో ట్రూ కాపీలూ, ఓ అప్లికేషనూ పంపించింది. ఆ తర్వాత ఓ టెలిగ్రామూ, ఉత్తరమూ రాస్తే రాసిన వారం రోజులకు పెట్టే బేడాతో సహా ఊళ్ళో దిగింది. మరో విశేషం - కూడా వాళ్ళమ్మమ్మను వెంటబెట్టుకుని మరీ వచ్చింది!

“తోడుగా వుంటుందనీ ఏలూరు వెళ్ళి ఆమెను వెంటబెట్టు కొచ్చాను” అంది.

ఆమె సావేరి స్వంత అమ్మమ్మ. కూతురు పోయాక మనవరాలుని తీసుకుపోవాలనుకుందిగాని అల్లుడు పడనిచ్చాడుకాడు. ఎప్పుడైనా వచ్చి మనవరాలుని చూసి వెళ్తుంటుంది. మనవరాలంటే ఆమెకు మా చెడ్డ అభిమానం.

సావేరి వచ్చేంతవరకూ నాకు అనుమానమే నిజంగా వస్తుందా అని. నిజంగానే వచ్చింది. నెలలతరబడి ఉండిపోయేదానిలాగ పెద్ద ఆర్భాటంతోనే వచ్చింది. లేకపోతే యింతదూరం రావడం నాలుగైదు రోజులువుండి వెళ్ళిపోవడానికా. ఆమె ఇక వెళ్ళలేదు. ఆమెచుట్టూ ఓ గోడ-మంచితనంతో ఎత్తుగా ఓ గోడ కట్టేసి దిగ్బంధనంచేసేస్తాను. ఆమె ఇక్కడే వుండిపోతుంది. ఈ జీవన ప్రాంగణం నించి ఆమె ఇక కదిలి వెళ్ళలేదు.

మనసంతా అర్థంపర్థంలేని ఆరాటంగా వుంది. బయటికి చెప్పుకోలేని పిచ్చి ఆనందంగా వుంది.

సావేరి యింట్లో అడుగుపెట్టింతర్వాత ఇంటికళే మారిపోయింది. బ్రహ్మచారికొంప బొట్టులేని ఆడదిలాటిదే. ఎన్ని డ్యూకో పెయింట్లు వేస్తే మాత్రం ఏమూలో కాస్తంత పసుపూ, మరి కాస్తంత కుంకుమా లేకపోతే వెలితిగానే వుంటుంది.

ముసిలావిడ వంట ప్రారంభిస్తానంది. సామాన్లేవీ లేవు. రెండు రోజులు హోటలు తిండే గతయ్యింది. మూడో రోజున నా కూడా బజారుకు వచ్చి కావలసిన సామాన్లూ, వెచ్చాలూ కొంది సావేరి. డబ్బులు నన్ను ఇవ్వనియ్యలేదు. "నా దగ్గర డబ్బు ఎక్కువేంలేదు. కానీ వున్నంతవరకూ నన్ను ఖర్చు పెట్టనియ్యి. ముందు ముందు అవసరంవస్తే నువ్వే యివ్వాల్సి వుంటుందిలే" అంది.

వాళ్ళు వచ్చిన నాలుగోరోజున ఆదివారం ఇంట్లోనే వున్నాను. మధ్యాహ్నం భోజనాలయ్యాక వాళ్ళ అమ్మమ్మ నిద్రపోయింది.

"ఆదివారం పూట నిద్రపోయే వాడి వేమో, నేనువచ్చి నీ అలవాట్లన్నీ మార్చేస్తున్నానుకదూ. నా వల్ల నువ్వు ఇబ్బంది పడాల్సి వస్తోంది" అంటూ నా గదిలోకి వచ్చి కూర్చుంది సావేరి.

"నేను రావడంవల్ల నీకు యిబ్బందే. నా గురించి ఆ మాత్రం ఇబ్బందిపడేవాళ్ళు నువ్వుగాక నాకింకెవరున్నారు. అందుకనే నీ దగ్గర కొచ్చాను" అంది తిరిగి.

"నేనేం ఇబ్బంది పడ్డంలేదు. పైపెచ్చు నువ్వొచ్చినందువల్ల నా కెంత సంతోషంగా వుందో తెలుసా. నిజంగా ఓ పండుగలాగే వుంది."

సావేరి యేమీ మాట్లాడలేదు. ఓ నిట్టూర్పుమాత్రం విడిచిపెట్టి గొణుక్కుంటున్నట్టు "నీ మంచితనాన్ని నేను నా స్వార్థానికి వుపయోగించుకుంటున్నానేమో. కాని యేం చెయ్యను మరి, మరో గత్యంతరం లేదు నాకు" అంది.

సావేరి చాలా అర్థవంతంగా మాట్లాడుతుంది. ఆమె మాటలూ, ఆమె ప్రవర్తనా తేలిగ్గానాకు అర్థంకావు. క్లిష్టాన్వయాలూ, కఠిన సమాసాలూ నిండిన ఏ సంస్కృత పదాల తెలుగుపద్యంలాగానో అనిపిస్తుంది సావేరి.

మొదటినుంచీ ఈ అర్థాలూ, ఈ తాత్పర్యాలూ నాకు వంట పట్టలేదు.

సావేరి నన్ను మంచివాడ్నని మెచ్చుకున్నందుకు కాస్త గర్వంగా వుంది. నిజానికి తననుతాను ప్రేమించుకోవడంకన్న, మెచ్చుకోవడం కన్న ఇతరులు తనను ప్రేమించాలనీ, మెచ్చుకోవాలనీ కోరుకుంటాడు మనిషి. ఎందుకంటే తననుతాను ఎలాగూ గౌరవించుకోలేడు. కారణం- తనలోని లోపాలూ, బలహీనతలూ అన్నీ అతనికి తెలుసుగనక.

"నేను ఎందుకొచ్చానో ఈ పాటికి నీకు అర్థమయ్యే వుంటుం దనుకుంటాను. యేమిటో, తెలిసుండికూడా అప్పుడప్పుడు కొన్నికొన్ని

పొరపాట్లు చేస్తుంటాం. ఆ పొరపాట్లే ఒక్కొక్కసారి పీకమీదకొచ్చి కూర్చుంటాయి. అలాంటి పరిస్థితుల్లోనే చిక్కుకొని ఇక్కడికి వచ్చాను..." సావేరి మధ్యలోనే ఆపి నా వేపుచూసింది. నేను వినడం చూసి—

"వెనక ఒకసారి నీతో చెప్పానేమో కూడా - దశవతారం, నేనూ పెళ్ళిచేసుకోవాలను కుంటున్నామని. పెళ్ళికి ఎప్పటికప్పుడు యేవో అవాంతరాలు వొచ్చిపడుతూనేవున్నాయి. ఈ మధ్యనే అతను మాస్‌కమ్యూనికేషన్ ట్రైనింగ్‌కని ఢిల్లీ వెళ్ళాడు. నాకేమో యేమీ తోచకుండావుంది. నా కడుపులో నలుసు కదులుతోంది. మూడోనెల. ఈ విషయం తెలిసాక రోజుకో వుత్తరం చొప్పున అరడజను వుత్తరాలు రాశాను. ట్రయినింగ్ అయ్యేవరకూ ఎలాగోలాగ గడిపేస్తే తనువచ్చి అన్నీ చక్కబరుస్తానన్నాడు. వీలయితే అబార్షన్‌కి ప్రయత్నించ మన్నాడు. నాకు చాలా కోపంవచ్చింది. యే గత్యంతరమూ లేకపోతే ఆ పనే చేసేదాన్నేమో మరి. ఇంతలో దేముడిలాగ నువ్వు అటొచ్చావు...?"

దీని ప్రభావం నా మీద ఎక్కువగానే పడింది. ఆమె ఆ తర్వాత యేం చెప్పినదీ సరిగా వినిపించుకోలేకపోయాను. బాధా? యేమో... చెప్పలేను. మనసంతా ఆరాటంగా, అశాంతిగా, తీరిగ్గా వినే ఓపిక కోల్పోయి చికాకు చికాకుగా వుంది.

"నిద్రొస్తున్నట్టుంది గాబోలు నీకు. పోనీ పక్క వేసేదా పడు కుందువుగాని."

"ఒద్దు, నేను వేసుకుంటాలే"

"ఏం, నేనువేస్తే నచ్చదా ?"

"ఇంతకాలమూ నాకు మరొకరి సాయం కావలసి వచ్చిందా, నా పని నేను చేసుకోలేదూ."

సావేరి బాధపడినట్టుంది. "నీ ఇంట్లోవుంటూ నీ తిండితింటూ ఆ మాత్రం నీ కిందచేస్తే తప్పా. గతిలేక నీ దగ్గరకి వచ్చానసేకదా ఇలా మాట్లాడుతున్నావు" ఎక్కిళ్ళొచ్చేసి, కళ్ళల్లో నీళ్లు తిరిగి చూస్తూండగానే యేడ్చేస్తోంది. బయటికి గట్టిగా ఏడవలేక తనలో తనే కుళ్ళిపోతున్నట్టు ఎక్కిళ్ళుపడుతూ, కొంగు నోటికి అడ్డం పెట్టుకుని మనసునిండా బరువుగా అల్లుకున్న దుఃఖంకరిగి కన్నీళ్ళై కారిపోయే వరకూ ఏడుస్తూనే వుండిపోయింది.

ఇంతకీ నేనేమన్నానని ఈ యేడుపు? ఆమెను బాధపెట్టాలన్న ఆలోచన నాకు యే కోశానాలేదు. ఇలా ప్రతి చిన్న విషయాన్నీ తనకు అన్వయించుకుని ఆమె బాధపడడమేమిటి! అయినా ఆమెను నేనెందుకు యేడిపిస్తాను. ఇంత కాలంగా బయటికి వ్యక్తంచేయలేక లోలోపలే బంధించేసుకున్న దుఃఖాన్ని ఇప్పుడు అవకాశం వచ్చిందని నా యెదుట పడేస్తోందికాని మరేంలేదు. ఆమెకు కావలసింది ఓదార్పు.

ఓదార్చడం నాకు చేతకాదు. యేడ్చేవాళ్ళని చూస్తే నా కంఠం కూడా దుఃఖంతో తడిసిపోతుంది. కంఠంలో జీరపలికి మధ్యలో ఆగిపోతుంది. అందుకని సావేరి ఏడుస్తోంటే నేనేమీ మాట్లాడలేక పోయాను.

అవతల నడవాలో ముసలావిడ దగ్గిన శబ్దం విని కళ్ళు తుడుచుకుని లేచి వెళ్ళిపోయింది సావేరి.

సావేరి రావడం ఓ చిన్న సమస్యే అయ్యింది నాకు. ఇంటివాళ్లు వూళ్ళో మరోచోటవుంటున్నారు గనక వాళ్ళ బాధ తప్పింది. చుట్టు

పట్ల వాళ్ళతో పరిచయం లేదు. ఇంట్లో ఆడాళ్ళుంటూవుంటే భాష వొచ్చినా రాకపోయినా పరిచయాలు పెరిగేవి. ఆఫీసులో మాత్రం ఇద్దరు ముగ్గురు కలీగ్స్ అడిగారు.

"చుట్టం" అన్నాను.

"అంటే ?" అన్నారు.

"అంటే చాలావుంది. చెప్తాలెండి" అన్నాను.

పకోడీ పొట్లంలాగ పనిచేసిందది. పొట్లంచూసి వెంటబడి తిరిగిన కుక్కల్లాగ చుట్టూ తిరిగారు. కసికొద్దీ చాలాసార్లు చుట్టూ తిప్పు కున్నాను.

ఇటాలియన్ స్టైల్ పిక్చర్లు ఎగబడి చూసే ఆ మనుషుల కుతూహలం, చేతులు కట్టుకుని కూచోలేకపోయింది! ఎలాంటి చుట్టమో తెలుసుకోవాలన్న కుతూహలం పురుగుని దొలిచినట్టు దొలిచిందేమో రెండు మూడుసార్లు యింటికొచ్చారు.

పెళ్ళికాని హిందూస్త్రీని గుర్తుపట్టడం చాలా తేలికే కదా. ధైర్యం వుంటే మెడనీ, లేనప్పుడు బుద్ధిమంతుడిలాగ పాదాల్నీ చూసేస్తే సరి.

వచ్చినవాళ్ళు పాదాల్నే చూసి గర్వంగా వెళ్ళిపోయారు. జూనియర్ సైంటిస్టులు వాళ్ళు. నిజంగా వాళ్ళు గొప్ప పరిశోధకులే. దేశానికి అవసరమైన ఓ గొప్ప సత్యాన్ని కనుగొన్నారు కదా మరి. కాదని ఎలా అనగలం ?

సావేరి కూడా బైటికి రావడానికి అంతగా యిష్టపడేదికాదు. వచ్చిన కొత్తలోనే ఓ సెలవు రోజున ముసలావిడ్నీ, సావేరినీ గాంధీ

స్మారకమందిర్ కు తీసుకెళ్ళాను. మరో రోజు సాయంకాలం గట్టిగా పట్టుబడితే 'బోత్తలాబ్ కు' వచ్చారు. ఊరంతటికీ మంచి నీటిని సరఫరా చేసే చెరువది. చెరువు పక్కనే పెద్ద తోటని పెంచి పిక్నిక్ స్పాట్ గా డెవలప్ చేశారు.

తోటలో వున్నంతసేపూ మనసేం బావుండలేదు. బయలుదేరినప్పుడున్న ఉత్సాహం, తీరా అక్కడికి వెళ్ళాక లేదు. గులాబీ మొక్క పక్కనించి వెళ్తోంటే ఓ ముల్లు గీరుకుపోయింది. గడ్డిలో కూచుందామని చెప్పులుతీసి గట్టు దిగి రాబోతూంటే పల్లేరుకాయ గుచ్చుకుంది. ఎక్కువసేపు తోటలో వుండలేకపోయాను. సావేరి కూడా చల్లగాలి పడదంటే తొందరగానే తిరిగి వచ్చేశాం.

ఆ తరువాత ఎప్పుడూ సావేరిని నా కూడా రమ్మనమని అడగలేదు. ఎక్కడికెళ్లినా యేవో జ్ఞాపకాలతో మనసుకే ముళ్ళు గుచ్చుకుంటాయి. ఒకసారి సావేరే సినిమాకు వెళ్దామని అంది. ఫస్ట్ కు జీతం అందుకుని ఇంట్లోకి కావలసిన సరుకులు కొందామని సావేరిని వెంట బెట్టుకుని బజారుకి వెళ్ళినప్పుడు తోవలో సినిమాహాలుని చూసి అంది "సినిమా చూసి చాలాకాలమైంది, మంచి సినిమా ఏదన్నావుంటే రేపు వెళ్దాం" అని.

మర్నాడు ముసలావిడ్ని రమ్మంటే "హిందీ సినిమా నాకేం అర్థమౌతుంది, మీ రెళ్ళండి" అంది. ఇద్దరమూ ఫస్ట్ షోకు వెళ్ళాం, సినిమా చాలా బావుంది. ఓ బండివాడిని ప్రేమించి, ఆ విషయం గట్టిగా హృదయానికి నచ్చ జెప్పుకునే ఆత్మస్థైర్యంలేక దూరంగా వెళ్ళిపోయిన ఓ నర్తకి కథ. సావేరికి కూడా బాగా నచ్చినట్టుంది, చూస్తున్నంతసేపూ సినిమాలోనే లీనమైపోయింది.

సినిమా విడిచిపెట్టాక టాంగాలో వద్దామంటే, ఉన్న అయిదారు టాంగాలూ జనాన్ని ఎక్కించుకుని వెళ్లిపోతున్నాయ్. ఫర్లాంగు దూరం నడిచి చౌరాస్తాదగ్గరకు వెళ్తే టాంగాలు వుంటాయిగాని ఆమెను అంత రాత్రివేళ నడిపించడం యిష్టంలేదు. ఆటోరిక్షాలో బయలుదేరాం. ఆ అనుభవం కొత్తది. వెచ్చగా కాలుస్తోన్న స్పర్శ. మలుపుల్లో తూలి పడకుండా గట్టిగా పట్టుకున్నప్పుడు వేళ్ళ చివరవరకూ సాగిన కోరికల తీగలు ఆధారాన్ని చుట్టుకుని పాకుతున్నాయ్.

సావేరి మౌనంగా నడుంమీంచి చేతిని తొలిగించేసింది. దగ్గరగా ముడుచుకుని రాయిలా బిగుసుకుపోయి కూచుండిపోయింది.

ఇంటికి వెళ్ళాక ముసలావిడ భోజనం వడ్డించబోతే పడుకోమని చెప్పి తనే వడ్డించింది. తలవంచుకుని తింటున్నాను. వంటింటి తలుపులు దగ్గరగా చేరేసి వచ్చింది. మరోపీటవేసుకుని కూచుని "నీ దగ్గరికి పెద్ద నమ్మకంతో వచ్చాను. నువ్వు అందరిలాంటివాడివి కావనీ, నీ దగ్గర నాకు యే ఆపదా వుండదనీ నమ్మి వచ్చాను. నా అసహాయస్థితిని అవకాశంగా తీసుకుని నువ్వుకూడా నన్ను అగౌరవపరుస్తావా ? పెళ్ళి కాకుండా తల్లినయ్యానేగా నువ్విలా చిన్నచూపు చూస్తున్నావ్." అప్పటికే ఆమె చెక్కిళ్ళమీదకి కన్నీళ్ళు జారిపోయాయి. ఆమె కంఠం బొంగురుపోయింది.

ఏం మాట్లాడగలను నేను ? యేమీ మాట్లాడకుండా మంచితనం పేరుచెప్పి నా నోరు కట్టేసింది. దొంగకు తాళాలగుత్తిచ్చే తెలివి ఆమెది! ఆమె ఎదుటినుంచి ఎంత వేగంగా తప్పించుకుందామా అని సగంతినీ, సగం వదిలేసి చేతులు కడుక్కోబోతే చూసి, కళ్ళద్దుకుని గబగబా లేచొచ్చి "అదేమిటి! అలా సగంతిని సగం వొదిలేసి లేచిపోతున్నావ్. నీ సంపాదన అంతా మాలాటివాళ్ళకి పెట్టడానికేనా, నీ సౌఖ్యం

గురించి ఆలోచించుకోనక్కర్లేదా. వుండు, లేచిపోకు. నువ్వు లేస్తే, నామీద ఒట్టే... కూరలన్నీ చల్లారిపోయినట్టున్నాయి, రెండు అప్పడాలు గబగబా వేయిస్తాను. తిందువుగాని" అంది.

ఇదిగో! యిలాంటప్పుడే సావేరి పరాయిదన్న విషయం కొట్టొచ్చినట్టు తెలుస్తుంది. సావేరి పరాయి మనిషికాదు. ఈ అభిమానం పరాయివాళ్ళు చూపించలేరు. సావేరి పరాయిది కానేకాదు. కాని సావేరి పరాయిదే. ఇది సత్యం. సత్యాన్ని అబద్దంగా ఎలాచూడను? నిజాన్ని అంగీకరించకుండా ఎలా వుండను?

ప్రతి పనిలోనూ సావేరి కల్పించుకుని చేస్తోంటే నాకు భయం వేస్తోంది - ముందుముందు నేను వట్టి బద్దకస్తుడిగా తయారవుతానేమో నని. రేప్పొద్దున్న సావేరి వెళ్లిపోతే మరొకరెవరో నా క్రింద చేసి పెట్టాల్సి వస్తుందేమో. వద్దంటే బాధపడుతుంది. కళ్ళనీళ్ళు కక్కుకుంటుంది. మాటిమాటికీ తన పరిస్థితిని ఎత్తి చెప్పుకుని, అందుకే చిన్న చూపు చూస్తున్నానంటుంది. ఇలాంటివాళ్ళతో వేగడం కష్టమే.

ఒకసారి ముసలావిడతోనే అన్నాను - పొద్దుట్నించి అలా ఎడ తెరిపిలేకుండా యేదో ఒక పని చేస్తూనే వుంటుంది. కాస్త తన ఆరోగ్యం గురించి చూసుకోమనండి, విశ్రాంతి లేకపోతే ఎలా" అని.

"నేనూ ఆ విషయమే మాట్లాడుదామనుకుంటున్నాను నాయనా. వొంట్లో యేమాత్రం రక్తంలేదు. ఒకసారి డాక్టరుకి చూపిస్తే మంచిది" అంది.

డాక్టరుదగ్గరకి తీసుకెళ్తానంటే వచ్చిందికాదు. ఎంతచెప్పినా వినిపించుకోలేదు. పెడచెవిని పెట్టేసింది. చివరకు డాక్టరును యింటికే తీసుకొచ్చాను. ఆవిడ వెళ్ళిపోయాక మనవరాలుని గట్టిగా కసురుకుంది

ముసలావిడ. "గుట్టుగా యింట్లో పెట్టుకుని తిండిపెట్టడం చాలక ఆయనచేత యీ ఖర్చులుకూడా చేయిస్తావటే. డాక్టరమ్మ వచ్చిందంటే ఎంత ఖర్చయ్యుంటుందో ఆలోచించావా. అడ్డమైనవాళ్ళందరికిందా ఆయన ఎందుకు చేయాలి. వెధవ బెట్టూ నువ్వూనూ. బుద్ధుంటే సరి. అయినా ఆ బుద్ధేవుంటే ఈ వ్యవహారం యింతదూరం ఎందుకొస్తుందీ."

సావేరి యేడుస్తున్నట్టుంది, ముసలావిడ మళ్ళీ కసురుకోవడం వినిపించింది.

ఆమె అలా కసురుకోవడం నాకేం నచ్చలేదు. నడవాలోకి వచ్చి నప్పుడు ఆవిడ్ని పిలిచి అన్నాను–

"కోప్పడకండి. అసలే ఆమె మనసేం బావుండలేదు. ఏమన్నా ప్రతీదీ తన పరిస్థితికి అన్వయించుకుని మరీ బాధ పడుతుంది. మనమే ఎగతాళిచేస్తే పరాయివాళ్ళకి మరీ లోకువ. అయినా ఇందులో ఎగతాళి చెయ్యాల్సినది యేముంది. రేప్పొద్దున్న దశావతారం ట్రయినింగ్ పూర్తిచేసుకొస్తే అన్నీ వాటంతటవే చక్కబడిపోతాయి."

ఆమె వయసులో మూడోవంతు లేదు నాకు. ఆమెకు నేను బోధచేస్తున్నానేమిటని ఆశ్చర్యపోతున్నదో యేమో నా ముఖంలోకి చూసి "ఆ... ఆ... వచ్చేవాటంగానే వుంది. అంత అభిమానం వున్న వాడే అయితే ఒకసారివచ్చి వెళ్ళకపోయేవాడా. ఇక్కడికి మేం వచ్చి మూడు నెలలు అవుతోందికదా. ఒకసారి వచ్చి వెళ్ళమని పదుత్తరాలు రాసినా వచ్చాడూ. పదిహేను పైసల కవరుమాత్రం రాశాడు. ట్రయినింగట, రావడానికి వీలుండదట. ఎప్పుడో వీలుచూసుకుని వస్తాడట. నిజంగా అభిమానమే వున్నవాడు, అమ్మాయి యిలాంటి పరిస్థితుల్లో వుందంటే నిమ్మకు నీరెత్తినట్టు వూరుకుంటాడా."

అయితే దశావతారం ఉత్తరాలు కూడా సరిగా రాయడం లేదన్నమాట! సావేరి ఎప్పుడూ చెప్పనేలేదే. పైపెచ్చు అతని దగ్గర్నుంచి ఉత్తరాలు వస్తున్నాయా అని అడిగితే ఊఁ అనికూడా అంది. పాపం! సావేరి మోసపోయినట్టుంది.

ఆఫీసుకు వెళ్ళానన్న మాటేగాని యిదే ఆలోచన. సాయంకాలం ఆఫీసునించి వొస్తూ తిన్నగా యింటికి రావాలనిపించలేదు. కాస్సేపు పార్కులో కూచోవాలనిపించింది. మంచి హోటల్‌కి వెళ్ళి స్వీట్సు తినాలనిపించింది.

ఊళ్లోకంతటికీ పెద్ద హోటల్లోకివెళ్ళి, ఓ అర్ధగంట పార్కులో గడిపి వస్తూవస్తూ బజారుకువెళ్ళి బుట్టెడు పళ్లు కొనుక్కొని వచ్చాను.

"ఇన్ని పళ్లా! నీకేం మతిపోయిందా, ఇవన్నీ తినమనే తెచ్చావా" అంది సావేరి.

నిజమే. చాలా పళ్ళున్నాయి, ఏమిటో... కొనెయ్యాలనిపించి కొనేశాను. ఆలోచించనే లేదు.

"పోనీ తిన్నన్నితిని మిగతావి వొదిలెయ్. అయినా ఈ ద్రాక్ష పళ్ళున్నాయి చూడూ... ఇలా మాటాడుతూ మాటాడుతూ కాలక్షేపంగా ఒకటొకటీ తినేసెయ్యొచ్చు" వాటిలోంచి ఓ అరడజను తెంచి గాలిలోకి ఎగరేసి, నోటితో అందుకుంటుంటే విచిత్రంగా చూస్తూ వుండిపోయింది సావేరి. చిన్నప్పుడు బఠాణీలు, వేరుశనక్కాయ గింజలూ యిల్లా ఎగరేసి అందుకోవడం అప్పుడే మర్చిపోయిందేమో!

"ఇవ్వాళ చాలా హుషారుగా వున్నావే, ఏమిటి విశేషం!" అంది.

హుషారా... వుండేవుండొచ్చు. ఏ విశేషంలేందే యింత హుషారు ఎక్కడిది. వుంది. కాని— ఎలా చెప్పను.

"ఇదిగో... నువ్విలా ఖర్చుపెట్టడానికి వీల్లేదు. నీచేత ఖర్చు పెట్టించడానికా మేం వచ్చింది. నీ యింట్లో వుండనిచ్చావు. ఆమాత్రం చాలు" అంది సావేరి. లోపలికెళ్లి ఓ కాగితంసంచి పట్టుకొచ్చి యిచ్చి "ఇదివుంచు. ఇందులో డబ్బుంది, మందులకి దీంట్లోంచి ఖర్చు చెయ్యి, నీ చేతిడబ్బు ఎంతకని పెడ్తావ్. మేం వచ్చిందగ్గర్నుంచి సరిగా యింటికి కూడా నువ్వు డబ్బు పంపిస్తున్నట్టులేదు" అంది. పుచ్చుకోనంటే వూరుకుందికాదు. డ్రాయరుతీసి లోపలపెట్టేసి వెళ్లిపోయింది.

ఈ వూరు వస్తున్నప్పుడు వాళ్ళమ్మ తాలూకు వస్తువొకటి ముసలావిడదగ్గరవుంటే అమ్మించేసి డబ్బు పట్టుకొచ్చినట్టు లోగడ చెప్పింది. ఇందులోనించే నెలనెలా రెండోతారీఖున యింటికి ఓ వందో డెబ్బయ్యో మనియార్డరు చేస్తోంది. మొత్తంమీద తెలివైనదే. మంచి పకడ్బందీగా అన్నిఏర్పాట్లూ చేసుకుంటోంది! కాని, యింత తెలివైనదీ ఎలా యీ గోతిలో పడిందో అర్థంకాదు. ఇప్పటికీ దశావతారాన్ని నమ్ముతోంది! అదే చిత్రం!!

ఆ తర్వాత ఒకసారి ఎప్పుడో దశావతారంనించి ఉత్తరం ఒకటి వచ్చినట్టు చెప్పింది సావేరి. ఏంరాశాడో అడగలేదు నేను. ఏంరాసినా అతనిమీద నాకు ఏమాత్రం నమ్మకంలేదు. ముసలావిడ వూహించింది అబద్ధమేంకాదు. అంత అభిమానం వున్నవాడు యేదోవిధంగా వీలు చూసుకుని రాకుండా వుంటాడా ?

నెలలు దగ్గరపడేకొద్దీ ముసలావిడికి కంగారు ఎక్కువయ్యింది. డాక్టరు టానిక్కులవీ వాడమనిరాసిస్తే వాడుతోంది. రెండు వారాలకు ఒకసారి డాక్టరువచ్చి వెళ్తోంది. డెలివరీ అప్పుడు ఆవిడ ప్రయివేటు నర్సింగ్ హోంలోనే చేప్పించాను.

మధ్యాహ్నం ఆఫీసుకు ఫోనువచ్చింది - ఆడపిల్లట. కంగ్రాచ్యులేషన్స్ చెప్పింది డాక్టరు. కంగ్రాచ్యులేషన్స్ నాకు చెప్పడంలో ఆమె తప్పేంలేదు. ఏమైనాపుంటే అది నాదే.

దశావతారానికి టెలిగ్రాం ఇచ్చాను. ఉత్తరంకూడా రాశాను. సమాధానం వచ్చింది. ఈ వార్త సంతోషాన్ని కలిగించిందట. మరో నెలరోజుల్లో ట్రయినింగ్ పూర్తయిపోతుందట. ఆ తర్వాత పోస్టింగ్స్ బహుశా హైదరాబాదులోనే యివ్వచ్చట. ఏకంగా అప్పుడే వస్తానని రాశాడు. ఈ విషయం సావేరికిచెప్తే ఏడ్చింది. అప్పటికి, ఆమెను ఇంటికి తీసుకొచ్చేశాను.

ఖర్చు బాగానే అయ్యింది. సావేరి యిచ్చినదాంట్లో నెలనెలా వాళ్ళింటికి పంపేయగా చివరికి ఏమీ మిగలలేదు. ఎస్. బి. లోంచి కొంత తీయాల్సి వచ్చింది. డెలివరీ తర్వాత సావేరి కోలుకోవడానికి కూడా బాగానే ఖర్చయ్యింది. "నీ ఋణం వుంచుకోను. ఎప్పటికైనా తీర్చేస్తాను" అని అంటుండేది. అస్తమానం యిదేమాట. లేదా కళ్ళనీళ్లు పెట్టుకోవడం.

దశావతారానికి మూడో నాలుగో ఉత్తరాలుకూడా రాసింది సావేరి. పెద్ద పెద్ద ఉత్తరాలే. పోస్టుచేయమని నాచేతికి యిచ్చేది. కవర్లు లావుగా అనిపించేవి. వాటికి సమాధానం రాసుంటాడనుకోను. రాసుంటే సావేరో, వాళ్లమ్మమ్మో చెప్పుండేవారు.

నెలా పదిహేను రోజులకి చివరికి ఓ ఉత్తరం వచ్చింది. ఉత్తరం పెద్దదే. అసలు సారాంశం మాత్రం చాలా చిన్నది. హైదరాబాదుకి పోస్టింగ్స్ యిస్తారనుకుంటే తీసుకెళ్ళి విశాఖలో పడేశారట. ఇక్కడకు వచ్చి వెళ్లడానికి టైములేకపోతే నేరుగా నాగపూర్ రూట్‌లో విశాఖ

వెళ్లిపోయాడట. తీరా చార్జితీసుకునేసరికి సెంట్రల్ మినిస్టర్ టూర్ ఒకటి వచ్చిపడిందట. ఆ హడావుడి అయిపోతే సెలవుపెట్టేసి వస్తా నన్నాడు.

మొత్తంమీద సావేరిని మాత్రం ఫూల్‌ని చేస్తున్నాడు. తెలివైన వాడే. ఎంత తెలివైనవాడు కాకపోతే సావేరిలాటిదాన్ని బుట్టలో వేసుకోగలుగుతాడు! విచిత్రమేమంటే, దశావతారం నాటకం ఆడు తున్నాడని యింత స్పష్టంగా తెలుస్తున్నా యింకా ఆమెకు ఆశ చావ లేదు. పాపం! నిజంగా అతను వస్తాడనే నమ్ముతోంది! పిచ్చిపిల్ల!!

ఓరోజు సాయంకాలం ఆఫీసునించి వచ్చి పాపదగ్గర కూచుని ఆడిస్తున్నాను. మరీ చిన్నపిల్లల్ని ఎత్తుకోవడం యిబ్బందే. ఇప్పుడిప్పుడే అలవాటవుతోంది. ఎత్తుకోబోతే "బట్టలు పాడుచేస్తుందేమో ఉండు, రబ్బరుగుడ్డ వేస్తాను" అంటూ రబ్బరుపీటు తెచ్చివేసింది సావేరి. చాలా సేపు పక్కనే నుంచుంది. విశేషమేదో వుండివుంటుదని అనిపించింది నాకు. తలెత్తిచూస్తే—

"రేపు సోమవారంకాక ఆపై సోమవారం వెళ్లిపోదామను కుంటున్నాను. ముందుగా రిజర్వు చేయించుకోవాలి కదా. అదీకాక నువ్వే డబ్బు సర్దుబాటుచేయాల్సి వుంటుంది. ఓ నూటయాభై అప్పుగా యివ్వు, బ్రతికుంటే ఎప్పటికైనా నీ ఋణం తీర్చుకుంటాను" అంది.

ముసలావిడ కూడా వచ్చింది. "అవున్నాయనా. ఇప్పటికే నీకు చాలా ఋణపడిపోయాం. ఆపదలో దేవుడిలాగ ఆదుకున్నావ్. నిన్నింకా యిబ్బంది పెట్టడం యిష్టంలేదు" అంది.

దగ్గర్లోనే ఎప్పుడో ఒకప్పుడు సావేరి తన ప్రయాణం సంగతి చల్లగా చెవిని వేస్తుందని అనుకుంటూనే వున్నాను. ఆ వార్తవినడానికి

సిద్ధంగానే వున్నా, తీరా విన్న తర్వాత మనసు బాధతో మెలికలు తిరిగి పోయింది. ఇంతకాలంగా ఆమె నా కింద సేవలుచేసీ, నేను ఆమెకింద చేసీ యిప్పుడిలా ఎవరికి ఎవరూ యేమీ కానట్టు విడిపోవాలంటే బాధ పడకుండా వుండలేకపోయాను.

"రమ్మని రాశాడా!" అని అడిగాను.

"లేదు. మేమే వెళ్దాం అనుకుంటున్నాం" అంది ముసలావిడ.

"ఎలాగూ అతను వస్తున్నాడుకదా. మరో నెలరోజులు చూసి ఆ తర్వాత వెళ్ళుదురుగాని" అన్నాను.

కాని సావేరి వొప్పుకోలేదు. వెళ్ళి తీరాలని పట్టుపట్టింది. ఒకవేళ నా దగ్గర డబ్బులేకపోతే తన చేతి గాజు ఒకటి అమ్మేస్తానంది.

ఆమెను ఆపడం నాకు చేతకాలేదు. ఆమెకింద యింత ఖర్చు పెట్టినా, యింత సేవచేసినా కొంత స్వార్థంతోనే చేశాను. కాని యిప్పుడు ఆమెను వెళ్లొద్దని ఆపడంలో నా స్వార్థం ఏమీలేదు. తీరా అక్కడికి వెళ్ళాక దశావతారం ఆమెను తిరస్కరిస్తే? ఎక్కడికి వెళ్ళ గలుగుతుంది? కూడా చిన్నపిల్ల ఒకర్తి. ఎక్కడికి వెళ్ళాలన్నా, ఏం చేయాలన్నా వీల్లేని పరిస్థితి.

ఆఖరిసారిగా స్టేషనుకు బయలుదేరేముందుకూడా చెప్పాను. ఆమె ఎలాంటి చిక్కుల్ని ఎదుర్కోవలసి వస్తుందో వివరించాను.

"నీ దంతా వట్టి భ్రమ. అతను అలాంటివాడేంకాడు. అతన్ని గురించి నీకు పూర్తిగా తెలీదులే" అంది. ఆమాట ఆమె మనస్ఫూర్తిగా అన్నదికాదు. అంత ధైర్యం వున్నది మాటిమాటికీ ఎందుకు కన్నీళ్ళు పెట్టుకున్నట్టు?

"దశావతారం మంచివాడే, కాదనను. కాని పరిస్థితులకు జడిసి ఒకవేళ అతను నిన్ను వదుల్చుకోవాలని ప్రయత్నిస్తే ?"

"నువ్వేం భయపడక్కర్లేదు - నేను ఆత్మహత్యలాంటి యే అఘాయిత్యానికీ పూనుకోను. అంత పిరికిదాన్నేంకాను. ఇదేమిటి ! నువ్వు యివ్వాళ యింత చిత్రంగా ఆలోచిస్తున్నావ్"

"యేమీలేదుగానీ ఓ విషయం జ్ఞాపకం పెట్టుకుంటావా ?"

"యేమిటది ?"

"ఒకవేళ అక్కడ నువ్వేమైనా చిక్కుల్లో పడితే ఇక్కడికి వచ్చెయ్యి. నేనున్నాను."

"ఎందుకూ, ఆశ్రయమిస్తావా ?" అంది సావేరి నవ్వుతూ.

"కాదు, పెళ్ళిచేసుకుంటాను."

ఆశ్చర్యంగా చూసింది సావేరి.

"దశావతారం నిన్ను తిరస్కరించాలని నేను కోరుకోవడం లేదు. ఒకవేళ తిరస్కరించడమేగాని జరిగితే యిక్కడ నేనున్నాను - మర్చిపోవద్దు."

ఆమె యేమీ మాట్లాడలేదు. మౌనంగానే అక్కడ్నించి కదిలి వెళ్ళిపోయింది.

రైలుకి టైమయ్యిందంటే వెళ్ళి టాంగా పట్టుకొచ్చాను. స్టేషనుకి వెళ్లాం. దారిపొడుగునా, స్టేషన్లోనూ నా మంచితనాన్ని ముసలావిడ పొగుడుతూనే వుంది. సావేరి మాత్రం మాట్లాడకుండా మౌనంగా కిటికీలోంచి చూస్తూ ఆలోచిస్తూ వుండిపోయింది. బండి కదిలింది.

వెళ్తొస్తానన్నట్టు తలాడించింది సావేరి. ఆమె కళ్లల్లో నీళ్ళు తిరిగాయి. దీనంగా కిటికీలోంచి చూస్తోంది.

"నేను చెప్పిన విషయం మర్చిపోవుకదూ. వచ్చేముందు వుత్తరం రాయి, స్టేషనుకొస్తాను."

ఆమె యింకా అలాగే చూస్తోంది. అలా చూస్తూనే చూపునించి తప్పుకుని దాటిపోయింది.

ఇంటికొచ్చాను. నే నెంత వంటరివాడ్నో నా కిప్పుడు తెలిసొచ్చింది. నా చుట్టూ మహా సరస్సులాగ వంటరితనం. ఎటు కదలినా బురద బురదగా అంటుకుంటున్న జ్ఞాపకాలు. ఇల్లంతా నిశ్శబ్దంగా నిద్ర పోతున్నట్టు వుంది. రాత్రంతా ఆలోచనలే. కంటిమీద రెప్పవాలలేదు.

పొద్దుట్నుంచి మళ్ళీ నా పని నేను చేసుకోవాలంటే బాధగానే వుంది. మొదట్లో నా పని నేను చేసుకునేవాడ్ని. సావేరి వచ్చి యితరుల మీద ఆధారపడడం నేర్పింది.

మళ్ళీ హోటలు తిండే గతయ్యింది నాకు. ఉన్న ఆ ఒక్కగానొక్క సౌతిండియన్ హోటల్‌నించి ఏం వస్తే అది తినక తప్పదుకదా. కేరియరు, అంతకుముందు ఓ ముసల్ది తెస్తుండేది. సావేరీ వాళ్ళూ వచ్చినప్పుడు మాన్పించేశాను. ఇప్పుడు మళ్ళీ ఆమెనే తెమ్మన్నాను. ముసల్ది ఆశ్చర్యంగా చూసింది. వాళ్లు వూరెళ్ళిపోయారని చెప్పాను. ఇంకా ఎంతమందికి సమాధానం చెప్పుకోవాలో ? ఎంతమంది ఎదుట భంగపడాలో ? మరింకెంతమంది అపహాస్యానికి గురికావాలో ?

సావేరి వెళ్ళిన మూడో రోజునించే వుత్తరం గురించి ఎదురు చూస్తున్నాను. ఇంకా ఆశ యింకిపోలేదు. ఎక్కడో పల్చగా, తడితడిగా

నన్ను అంటిపెట్టుకొనే వుంది. సావేరినించి నేను నేర్చుకున్నవాటిలో మరోటి-నిరీక్షణ. చిన్నప్పుడు అర్థాలు నేర్చుకున్నాను. పెద్దయ్యాక నిరీక్షించడం నేర్చుకున్నాను.

శనివారం ఒకపూటే ఆఫీసు. ఇవ్వాళైనా యింటికొచ్చేసరికి సావేరిదగ్గర్నుంచి వుత్తరం వచ్చివుంటుందని హడావిడిగా ఆటోలో వచ్చాను. తలుపుతీస్తే లోపల ఏ వుత్తరాలూ లేవు, మనియార్డరు రసీదు మాత్రం వుంది. ఇంటికి పంపిన మనియార్డరు తాలూకు ఎక నాలెడ్జిమెంట్ రసీదు అది.

కేరియర్ వస్తే భోంచేస్తున్నాను. ఇప్పుడిప్పుడే హోటల్ తిండి అలవాటవుతోంది. సావేరివాళ్ళూ వెళ్ళిపోయిన తర్వాత మూడు రోజులవరకూ సరిగా భోజనమే చేయలేదు.

కేరియర్ తెచ్చే ముసల్ది హడావుడిగా టెలిగ్రాం పట్టుకొచ్చింది. సావేరిదగ్గర్నుంచేనేమో. ఆ ఆతృతలో ఎంగిలిచెయ్యి కడుక్కున్నానో లేదో తెలీదు. సంతకంపెట్టి పోస్టుమేన్‌ను పంపించేసి టెలిగ్రాం విప్పాను.

అవును, సావేరి దగ్గర్నుంచే.

ముసల్ది ఆతృతగా చూస్తోంది. కాదుమరీ! టెలిగ్రాం అంటే ఎవరికైనా కంగారే.

పాపం ఆ ముసల్దాన్ని చూస్తే జాలేస్తోంది. బీదది. ఎవరూ లేరు. ఆమెతో ఎల్లుండినించి కేరియర్ తేవక్కర్లేదని చెప్పాలంటే నాకు నోరు రావడంలేదు.



# మదరిండియా

లత

వెంకటరత్నం, అప్పలసామి యిద్దరూ ముద్దాయిలుగా కోర్టులో నిలబడ్డారు. రెండో ముద్దాయి మేనత్త చిననరసమాంబ వీళ్ళిద్దరూ కలిసి తనని గోనిసంచిలో వేసి మూతి బిగించి చంప ప్రయత్నించారని ఫిర్యాదుచేసింది. ఇప్పుడదే కేసు విచారణకి వచ్చింది.

ముద్దాయిలు కూర్చునే బెంచి మీద ముద్దాయిలిద్దరూ ముడిచి పెట్టుకు కూర్చున్నారు. రెండో ముద్దాయి అప్పలసామి కాటామేస్త్రీ. పొట్టిగా లావుగా వుంటాడు. కాళ్లూ చేతులూ తాబేలుకాళ్లూ చేతుల్లాగా కురచగా ఉంటాయి. పిల్లలాడుకునే ఒకరకం బొమ్మలాగా మొండెం మీదనే తల అతికించినట్లువుంటుంది. ఇహ మొదటివాడు వెంకటరత్నం సన్నగా ఓమాదిరిగా వున్నాగాని వంకర మెడ, చప్పి దవడలు మెల్ల

కన్నువల్ల వికారంగా వుంటమేకాకుండా జబ్బుపడినట్లుగా కూడా కన్పిస్తాడు. ఇతని వృత్తి ఆంధ్రదేశంలో నాటుసారా అమ్మటం.

సాకులు కూర్చునే మరో బల్లమీద చిననరసమాంబ ఉరఫ్ చిన్నారసమ్మ కూర్చుని వున్నది. పుప్పిగోరులాంటి మొహంతో సామాన్యంగా నిద్రోస్తూ పోవటానికి వీల్లేని పరిస్థితుల్లో వున్నదానిలా కన్పిస్తుంది. ప్లీడరుగారు ఆవిడనిచూసి "శ్రీమతి చిననరసమాంబ ఉరఫ్ చిన్నారసమ్మగారూ, వీళ్ళిద్దరూ, నీదగ్గరకొచ్చి నిన్ను గోనెసంచిలో దించి మూతికట్టేవరకూ చూస్తూ ఎట్లా వూరుకున్నావమ్మా ?" అని ప్రశ్నించాడు.

"అయ్యా ! మరేం జరిగిందంటే..."

"లేచి నుంచుని కోర్టువారికి వివరంగా మనవిచెయ్యి ! !"

చిన్నారసమ్మ లేచి నిలబడింది. అప్పుడు ఆమె స్వరూపాన్ని చూసి జడ్జీగారే దడుసుకున్నారు.

"అప్పుడు నేను పిడకలు చేస్తున్నానండి. వీళ్ళిద్దరూ-వీళ్ళుపాడు గాను-మెల్లిగా వచ్చినారండి. మా చచ్చినాడు ఇంకా కూటికి తగలడక పోవడంవల్ల ఆడికోసమే చూస్తున్ననండి. ఇట్టి సమయంలో ఈళ్ళిద్దరూ నన్ను చరోవేపునుంచి పరీచ్చగా కళ్ళార్పకుండా సూట్టం ఆరంభించారు. అయ్యా ! ఈళ్ళిద్దర్నీ కిందపెడితే పంటలూ, పైన పెడితే వానలూ వుండవండి. "ఏరా ఏంగావాలి, కూడుతింటావా" అని అడిగాను ఈళ్లిద్దరూ మాట్టాడితేనా......"

ముద్దాయి అప్పలసామి ఫిర్యాది మాటలకడ్డోస్తూ "నేనే అప్పుడు బాగా తాగేసున్నాను బాబయ్యా" వెంటనే రెండో ముద్దాయి

వెంకటరత్నం ఎత్తి పొడుపుగా ''యిద్దరం తాగేసినామని చెప్పరాదురా అప్పిగా. నీవుత్తె హరిశ్చంద్రుడి తమ్ముడివి కాదుగా'' అన్నాడు.

జడ్జీగారు సీరియస్‌గా ప్రశ్నించారు.

''అంటే ఇద్దరూ బాగా తాగి వున్నారనా మీ అభిప్రాయం?"

''సరిగ్గా అంతేనండి అయ్యా!'' అన్నాడు అప్పలసామి. "సరే నువ్వు చెప్పేది కానివ్వమ్మా'' అని కసిరాడు ప్లీడరుగారు.

"చిత్తం బాబూ! ఆ తర్వాత అప్పిగాడు నాతో అన్నాడుగదా 'అత్తా అయిదు రూపాయలిస్తాను, చెప్పినట్లు చేస్తావా' అన్నాడు. వీళ్లు ఎదవలని తెలిసినాగాని బాబయ్యా అయిదు రూపాయిలకాశపడ్డానండీ. మరి అయిదు రూపాయలండీ. ఐదురూపాయిలే లేవండి. అందుకని ఒప్పేసుకున్నానండి. లోనున్న కాటాసామాన్లు బయటపెట్టమన్నరండి. అయ్యా! మోచేయి బెణికినా చచ్చీచెడి అవి చేరేసినానండి. దిక్కుమాలిన కాటా మీరెప్పుడూ మోయలేదనుకుంటాను బాబయ్యా, తగని బరువండి.

"అయ్యా అంతసేపూ ఈ పనికిమాలిన ఎదవలిద్దరూ కూచుని గ్లాసు మీద గ్లాసు తాగేస్తునే వున్నారండి. మరి మద్యనిషేధం తీసేసినారు గదండి! దొరలు! తమకేం తీసేసినా తీసేశారు. తమ సొమ్మేంపోయింది గనక'' అని జడ్జీగారే మద్యనిషేధం రద్దుకాయం చేసినట్లు కోప్పడింది చిన్నరసమ్మ.

అది విని ప్లీడరు ఖంగారుపడుతూ కసిరి ఆమెను కథ కానివ్వమన్నాడు.

"వద్దురా ఇక తాగమాకండిరా అన్నాను...ఆల్లినలేదండి... నీ పని నువ్వు చూసుకోయే అని కసిరారండి. తాగిన కుంకలతో మన

కేటని నేనూ నా పనిమీదుండి పోయానండి. ఆ దిక్కుమాలిన కాటా, రాళ్ళూ-ఇవతలకి చేరేసినాక వాళ్ళకి చెప్పానండి... అప్పుడప్పిగాడు అన్నాడుగదా 'అత్తా ఆ ముతకసీర ఇప్పి చిన్నగుడ్డకట్టుకురా' అన్నాడు. నాకు బయం వేయలేదండి. ఆ వెధవలు నా చేతిలోనే పెరిగారు... ఆ పైన అయిదు రూపాయిలు సూడండి, బీదముండని, నాకు అయిదు రూపాయిలు ఎలాగొస్తాయి సెప్పండి బాబయ్యా.'

"సరేనని చీర ఇప్పానండి...కడియాలు తియ్యమంటే తీశానండి కట్టుకునే చిన్నగుడ్డతప్ప పుట్టిందాన్ని పుట్టినట్టే ఉన్నాననుకోండి బాబయ్యా.

"ఆపళంగా వాళ్లిద్దరూ లేచి పక్కనున్న గోనెసంచి అందుకుని నన్నందులో కుక్కి కాటాలో పెట్టారండి. నాకు ఊపిరాడలేదండి. బాబయ్యా. అరిస్తే తంతామన్నారండి. దర్మపెబువులు మరేం చావ మంటారో చెప్పండి...వాళ్ళు నన్ను బయటకు తీసి 'అత్తా చీరకట్టుకో' అనగానే పారిపోయి కరణంగారింటికి పోయానండి... ఆయన పోలీసుల క్కబురప్పించేసరికి ఈళ్ళిద్దరు పోట్టాడుకుంటున్నారండి. ఏభయి కిలో లుంటుందని ఒకడూ, నలభయ్యారేనని మరి ఒకడూ కలబడ్డారండి... ఏటో బేరంటండి, అదేటో మరి పోలీసులు ఇద్దర్నీ పట్టుకున్నారండి. అంతేనండి. సత్తెప్పమానకంగా జరిగిందింతేనండి."

అని నమ్మకంగా పలికి కూర్చుంది, చిన్నరసమ్మ - కోర్టువారి గుసగుసల్ని కసిరి.

"ముద్దాయి అప్పలసామి కిరాతకుడు. అతనే ఈ హత్యా ప్రయత్నం చేశాడని నమ్మకంగా తెలుస్తున్నది. శ్రీమతి చిన్నరసమ్మ గారి ఆభరణాలకాశించి ఈ ఘాతుకం తలపెట్టినట్లు స్పష్టం అవుతున్నది" అన్నాడు ఫిర్యాది తాలూకు ప్లీడరుగారు.

"దీనికి నీ సంజాయిషీ ఏమిటి అప్పలసామీ" అన్నారు జడ్జీగారు. తెలుగు తనెంత తీయగా పలకాలో అంత తీయగానూ పలికినట్లు సంతృప్తిపడుతూ.

అప్పలసామి లేచి నిలుచుని దీనంగా—

"నేను తాగేసి ఉన్నానండి బాబయ్యా" అన్నాడు.

"ఆ సంగతి నేను గ్రహించాను. అనంతరం!" అన్నాడు మేధావంతుడైన జడ్జీగారు.

"చిత్తం. చెప్తానండయ్యా ఆ రోజు-నేను రత్తిగాడి సారా దుకాణందగ్గిర కెళ్లేనండి...అడో గలాసు నాకిచ్చాడండి. అడుకూడా ఓటి యేసుకున్నాడు—మరి నేను మర్యాదకోసం ఆడికో గలాసుయిచ్చి నేనో గలాసు యేసుకున్నాను... ఇలా మద్దానందాకాఇస్తి వాయనం పుచ్చుకుంటి వాయనంగా తాగేశామండి. ఆపళంగా రత్తిగాడు ఏడ్వడం ఆరంభించాడండి.

"ఏట్రా, ఎందుకు దుక్కపడతావు" అని అడిగానుగానండీ ఎల్లుండికి ఏబయి రూపాయలు కావాల నాకు నేను ఏడవడానికి రెడీగా ఉన్నాను.

"ఒరేయి అప్పీ నాకు అమ్మలేదురా... మాయమ్మ సిన్నతనం లోనే నన్నొగ్గేసి లేచిపోనాదిరా... అమ్మో అమ్మో" అని అడు శవం దగ్గర ఏడిసినట్టు రాగాలారంభించాడు... నాకప్పుడో బెమ్మాండమైన అయిడియా వచ్చిందండి, ఆడికి అమ్మ కావాలి...నాకా ఏభయి రూపాయలు కావాలి... కనక మా అత్తనమ్మేస్తే ఇద్దరి లాభం అనుకుని ఆడికా ఇషయం చెప్పానండి... తాగీసినాం గందా భాబయ్యా ఆడు

నొప్పేసుకున్నాడండి... ఆడూ మరి తక్కువ తాగనేదుగదా 'ఎంత కిస్తావు? ఏ లెక్కకిస్తా' వన్నాడండి. నేను కాటా మేస్త్రీని. ఆ అలవాటు పెకారం కిలోల లెక్కన అమ్ముతా నన్నానండి... ధర దగ్గర కాస్త పేచీ ఒచ్చినా... ఏభయి నాలుగురూపాయల తొమ్మిదణాలు నాకు కావాలి అది ఏరొక యవ్వారం లెగండి... కిలో బియ్యం రూపాయి బేడా... ఆ లెక్కనే అత్తనికూడా అమ్ముతానన్నానండి. కనీసం ఏబయి రూపాయలు వొత్తాయని నా అంచనా అండి..." అన్నాడు అప్పలసామి. ఇంతలోనే వెంకటరత్తం తేలికుట్టినట్లు కయ్యిమని ప్రారంభించాడు.

"అయ్యో! చిత్తగించాలి పెబువులు...వయసులోవున్న ఆడదయితే కిలో రూపాయిబేడా అర్థం ఉంది...నాక్కావాల్సింది అమ్మ... ముసిల్ది కదాండి మరి, ఈ ఎదవ అంత ధర చెపుతే అంతకూ నే నొప్పుకున్నానండి..."

"ఎదవది మేకనే కిలో నాలుగు రూపాయల కమ్ముతారుగదా అత్తని అంతకంటే తక్కువకి అమ్మటము ఏటి నాయమో తమరే సెలవియ్యండి... సారా అమ్మేవోడికే అంత తెలివుంటే మరి నేను కాటా మేస్త్రీని, యాపారంలో బరువు సులువులన్ని నాకు తెలుసు... కిలో రూపాయి బేడకి తగ్గనన్నాను...ఆడు రూపాయికంటే ఇవ్వనన్నాడు. చివరికి రూపాయి పదిపైసలకి బేరం కుదుర్చుకున్నామండి... సరే ఇద్దరం ఇంటికి వచ్చామండి. అత్త పిడకలు వేస్తోంది... ఏబయి రూపాయలు రాకపోతయ్యా అని నా దైర్యం. ఆడి దైర్యం ఏటంటే అటుగింజలా ఉందిగదా సవగ్గాకొనేసి అమ్మగా ఉంచుకుందామని.

"అయ్యా ఇద్దరం తాగేసి ఉన్నాం. ధర్మ పెబువులు కటాచ్చించాలి. మరిప్పుడు తూకం సంగతేటనే ఆలోచన వచ్చింది. మా అత్త సంగతి తమకి తెలవదు. ఆ నంజ మా సెడ్డ తెలివిగలది... ఓ పట్టాన అది మాట వినదు...డబ్బంటే మహాయాశ...దానికి డబ్బాసపెట్టి సంచిలో

దూర్చి కాటాయేద్దామని నిర్ణయం సేసుకున్నాం" అన్నాడు అప్పలసామి.

"అయ్యా నేనుకూడా మనవిసేస్తానండి...వీడున్నాడే అప్పిగాడు మాసెడ్డ తెలివిగలోడు... అదిగో నాళ్ళక్తిని సూసేరుగా... నాకు అమ్మ...అమ్మకావాలి. నేను తల్లి లేనోడినిగదా, తల్లి లేకపోతే అందు కని... కాస్త దరజాస్తే అయినా అమ్మని కొందామనే అనుకున్నాను. మా అమ్మే అలా నిలబడి నా ఇంటో పిడకలు వేస్తుంటే నా కేటి కావాలా ఈ నోకంలో అనుకున్నాను. అందుకని అప్పిగాడి అత్తని సంచీలో దూర్చి కాటా యేసినాం... కొనండయ్యా లెక్క తేలిస్తే... నేను అరవయిమూడు రూపాయలు ఇవ్వాల్సి వచ్చింది. నాదగ్గర నలభై ఎనిమిదికంటేలేవు. ఆడేమో యీల్లేదంటాడు... ఇంతలో పోలీసు లొచ్చారండి. న్యాయ ప్రకారం మా అమ్మని నాకిప్పించాలండి" అన్నాడు మరో ముద్దాయి, వెంకటరత్తం.

"అయ్యా దర పూర్తిగా ఇస్తే నాకభ్యంతరం లేదండి. ఎంతగా గీసినా బేరం బేరమేనండి. పెబువులు కటాచ్చించాలి" అన్నాడు అప్పలసామి.

జడ్జీగారూ, కోర్టూ నిర్ఘాంతపోయేరు...ఇలాటి కేసుకి తీర్పే మిటో గతించిన న్యాయశాస్త్రంలో ఎక్కడా లేదు.

ఇంతలో శ్రీమతి చిన్నారసమ్మ...

"అయ్యా నా అయిదు రూపాయలు ఇవ్వలేదండి ఎదవలు... నాయం దయసేయించాలి తమరు" అన్నది.

"అమ్మ...నాకు అమ్మ కావాలి. ఎంతదరయినా సరే నాకు అమ్మ కావాలి... తల్లి లేనోడిని దిక్కులేనోడిని" అని ఏడవటం ప్రారంభించాడు వెంకటరత్తం. అంతవరకూ మాట్లాడకుండావున్న కుర్ర ప్లీడరు తన అభిప్రాయం వెలిబుచ్చాడు—

"దిసీజ్ మదరిండియా." **

# సృష్టిరహస్యం

సి. ఆనందారామం

"ఓయ్, దేవుడోయ్! నన్నెందుకు తీసుకుపోవురోయ్!"

ఇది రోదన కాదు, కుశలప్రశ్న! నన్ను చూడగానే గంగాభాగీరథీ సమానురాలైన తులసమ్మగారు మామూలుగా పలకరించే పలకరింపు.

ఆ తరువాత నేను "ఏం జరిగింది, బామ్మగారూ?" అని అడగటమూ, ఆవిడ తన భాగవతాన్ని విప్పటమూ, నేను ఓపిగ్గా విని చేతనయిన సహాయం చేసి రావటమూ మామూలు.

ఆవిడ కుశలప్రశ్నకు సమాధానంగా చిరునవ్వు నవ్వి "ఏం జరిగింది, బామ్మగారూ?" అన్నాను.

"చెప్పటానికి నోరు రావటం లేదురా, చిట్టీ! లోకంలో ఇంత ఘోరం ఎక్కడైనా విన్నావా నువ్వు?" ప్రశ్న అడిగి సమాధానం కోరని వ్యక్తుల్లో బామ్మగారొకరు. వెంటనే అందుకున్నారు మళ్లీ.

"ఈ మధ్య నాలుగు రోజులుగా గుండెల్లో పోటురా, చిట్టీ! బొత్తిగా మంచంమీంచి లేవలేక పోతున్నాను. ఇలా అని చెప్తే మావాడేమన్నాడో తెలుసా?... హవ్వ ఎందుకులే! కడుపు చించుకుంటే కాళ్లమీద పడుతుంది... నన్ను హాస్పిటల్లో పడేస్తాట్ట!"

గాజుగుడ్లలా ఉన్న కళ్లు పెద్దవిచేసి ఎంత ఘోరమో చూశావా అన్నట్లు నా వంక చూసి ఆ ఘోరం తనే వివరించారు.

"ఆ హాస్పిటల్లో చేరినవాళ్లెవరయినా ప్రాణాలతో బయట పడటం నువ్వెరుగుదువురా! ఆ ధర్మాసుపత్రిలో అంతా అధర్మమే! అల్లావేళ ఆ రామనాథంగారు ఆ ఆసుపత్రిలోనే గుటుక్కుమన్నారు. మహాలక్ష్మమ్మగారి కోడలు, దాని పేరేమిటి?... ఏదోలే! పెద్ద ప్రాణం... గుర్తుకు రావటం లేదు... ఈ ఆసుపత్రిలోనే గుటుక్కుమంది. ఇంకా పెద్దవీథిలో రామలక్ష్మమ్మగారి..."

ఆ హాస్పిటల్‌లో చచ్చిపోయిన వాళ్లందరి పేర్లూ గుర్తుకు తెచ్చుకుంటున్నారు బామ్మగారు. అదే హాస్పిటల్లో చేరితే తనకు కూడా మరణం తప్పదని భయపడి "నన్ను తీసుకుపోరా, దేవుడా!" అని ఏడుస్తున్నారు.

పాపం, తన మాటల్లో వ్యంగ్యం ఆవిడకి తెలియదు కదా! ముడతలు పడి పాలిపోయిన దవడలు. ఎప్పుడూ కాస్త తెరిచినట్లుగా ఉండే నోరు. ముగ్గుబుట్టలాంటి పలచని జుట్టు. జీవం నశించి, చూపు మసకబారిన పెద్దకళ్లు... ఆ కళ్లలో కొట్టొచ్చినట్టు కనబడుతూన్న

మృత్యుభయం. భయంతో ఆర్తనాదం చెయ్యటమే ప్రాణి జీవంతో ఈ లోకంలోకి వచ్చిందనటానికి చిహ్నం. జీవలక్షణమే మృత్యుభయం.

"అలా అన్నాడా వాసు? నే చెప్పిచూస్తాలెండి..."

''లాభం లేదురా! అసలా వాసుదేం తప్పులేదురా! అంతా అదిగో...ఆ చుప్పనాతి— ఓపికున్నన్నాళ్లూ యంత్రంలా తిరిగి దీనికి చాకిరీ చేశానా? ఇప్పుడు కాస్త రోగం వచ్చేసరికి ఆసుపత్రికి ఈడ్చి పారెయ్యమని మొగుడికి పురెక్కించింది— వెర్రి నాగన్న! పెళ్లాం మాయల్లో పడిపోయాడు! ఏం చేస్తాడు?" ఏడ్చేస్తూంది తులసమ్మగారు.

తులసమ్మగారిచేత ''చుప్పనాతి'' అని పిలవబడే సుభద్రను నే నెరుగుదును, నిజానికి సుభద్ర చుప్పనాతిదికాదు— పాపం! సాధ్యమై నంతవరకూ అత్తగారితో సర్దుకుపోవాలనే చూస్తుంది. కానీ, వాసు చాలా డబ్బు కాఫీనం మనిషి. వాడికి తల్లీలేదు, భార్యా లేదు — రూపాయలూ,నయాపైసలు లెక్కపెట్టుకోవటమే వాడి జీవితధ్యేయం. తులసమ్మగారు పూజలకూ నోములకూ చెయ్యి జాపినపపుడల్లా వాడు మొండిచెయ్యి చూపెడతాడు. వాడి నలా వెళ్ళనిచ్చి కోడలు మీద విరుచుకుపడుతుంది ఈవిడ.

కొడుకును ఏమీ అనలేదు. అనకపోవటమే కాదు, తనకు డబ్బి య్యటం కొడుక్కి ఇష్టం లేదని అనుకోలేదు కూడా. అందుకే అదంతా కోడలి ప్రోద్బలమనుకొని సుభద్రను ఆడిపోసుకుంటుంది. కొంతవరకూ సహించిన సుభద్ర చివరకు ఎదురు తిరుగుతుంది. అప్పుడింక బాహా బాహి... ముష్టాముష్టి... ఘోరసంగ్రామం... చివరికి ఎవరికి తోచిన జాగా వాళ్లు చూసుకుని ఎవరికి నచ్చిన రాగంలో వాళ్లు రాగాలాపన సాగించటం!

ఇంత జరిగినా వాసు వజ్రసంకల్పం సడిలేది కాదు. చివరకు తుల సమ్మగారు యథావిధిగా పలకరించటమూ, నేను చేతనయిన సాయం చేయటమూ రివాజయి పోయింది.

''బెంగపడకండి, వాసుకి చెప్తాను. హాస్పిటల్‌లో చేర్పించడు లెండి.''

''ఏం లాభం లేదు, చిట్టీ! వాడికిప్పుడు పెళ్లాం ఎంత చెప్పితే అంత! అది నా పీడ ఎప్పుడు విరగడవుతుందా అని చూస్తూంది. తల్లి కోసం ప్రాణం ఎంత కొట్టుకులాడిపోతున్నా దానిముందు గులామయి పోతున్నాడు బిడ్డ!''

తన దుస్థితికీ, కొడుకు దుస్థితికి కలిపి కన్నీళ్లు కార్చింది ఆవిడ.

లోపలినుండి ఈ మాటలన్నీ వింటున్నట్లుగా ఉంది సుభద్ర. ఇంక ఆగలేక బయటికి వచ్చింది.

''చూడండి, అన్నయ్యగారూ! ఈవిడని ఆసుపత్రిలో వెయ్యమని అన్నానా నేను? ఇంట్లో వైద్యమంటే తడిసి మోపెడవుతుందని ఆయన కాదుకూడదన్నారు. కావాలంటే నా నాను తాకట్టు పెట్టుకోమన్నాను. చెంప ఛెళ్లుమనిపించారు. ఆయనలాగ, ఈవిడిలాగ...''

''నోరు మూసుకోవే! పెట్టవలిసిన ఎసరంతా పెట్టేసి నంగనాచి వంగముల్లులా తీర్పులకు తయ్యారయ్యావు.''

''నేనే ఎసర్లూ పెట్టలేదు. మీరు పెడుతున్నారు. నిండింట్లో శోకాలు. ఇప్పుడేమంత వచ్చిందని...''

''చూశావా? చూశావా?... నాకేం రాలేదుట! దుక్క ముక్కలాగుండి రోగమంటున్నానుట! రెండు కళ్లూ ఉన్న వాళ్లెవరి కయినా పుట్టెడు రోగంతో తీసుకుంటున్న ముండనని ఇట్టే తెలిసి పోతుంది. ఈ చుప్పనాతి కళ్లకి మాత్రం రాయిలా కనిపిస్తున్నానుట! దీని కళ్లు కాలిపోనూ!''

''నా కళ్లు కాలిపోవాలా? అంత...''

శ్రుతిమించి రాగాన పడుతున్నదని గ్రహించాను. దెబ్బలాడు కొంటున్న వాళ్లిద్దరూ కావలసినవాళ్లే. అంటే వాళ్ల మధ్యన నిలబడ వలసి వస్తే ఆ అవస్థ అనుభవించిన వాళ్లకి కాని తెలియదు.

''నువ్వు లోపలికి వెళ్లు, సుభద్రా! నేను సర్ది చెపుతాలే!'' అన్నాను.

నా మాటమీది గౌరవంతో కళ్లొత్తుకొంటూ లోపలికి వెళ్ళి పోయింది సుభద్ర.

'' మీ రూరుకోండి, బామ్మగారూ! మీ కెందుకూ బెంగ! నేను లేనూ! అంతగా వస్తే మా ఇంటికి తీసుకువెళతా లెండి.''

"నా తండ్రే! నీ అమ్మ కడుపు చల్లగా ఎంత మాటన్నావురా! వెయ్యేళ్లు చల్లగా బ్రతకరా నా ఆయుష్షుకూడా పోసుకుని...ఇలాంటి రాక్షసి కోడలిగా దాపురించినందుకు ఆ శ్రీమన్నారాయణమూర్తి నిన్ను చూపించాడు. నువ్వే లేకపోతే...''

ఆవిడ ధోరణి అప్పట్లో ఆగదని తెలుసు కనక "వస్తానండీ!'' అని బయలుదేరాను.

అయినా వెనకనుండి తులసమ్మగారి దీవనలు వినపడుతూనే ఉన్నాయి, కోడలికి పెట్టే శాపాలతో కలిసి. ఇక్కడ మరో గమ్మత్తే

మిటంటే నే నావిడికి కోడలితరపు బంధువునే! సుభద్ర ఏదో దూరపు చుట్టరికాన్నిబట్టి నాకు చెల్లెలవుతుంది.

ఏదో మాటసామెతకు భారం నా మీద వేసుకున్నానే గాని నిజంగానే తులసమ్మగారిని మా ఇంటికి తీసుకువెళ్ళవలసి వస్తుందని నే ననుకోలేదు.

...

వారం రోజుల తరువాత నేను వెళ్ళేసరికి ఆవిడ మంచంలో పడి మూలుగుతున్నారు. ముఖం బాగా పీక్కుపోయింది. కంఠస్వరం బాగా నీరసించింది.

నన్ను చూసీచూడగానే మామూలుగా పలకరించారు.

"ఆ నారాయణమూర్తి నన్నెందుకు తీసుకుపోడు, దేవుడోయ్!"

పెదవులు అల్లల్లాడి పోతున్నాయి. కళ్ళనిండా భయం. నా చేతులు రెండూ గట్టిగా పట్టుకున్నారు.

"చిట్టీ! నన్ను మీ యింటికి తీసుకుపో! వీళ్లు నిష్కారణంగా నన్ను చంపేసేలా ఉన్నారు!..."

ఆవిడ గొంతు... నూతిలోంచి వస్తున్నట్లుగా సన్నగా ఉంది. అయినా అందులో ఆర్తి స్పష్టంగా ధ్వనిస్తూంది. వాసుకూడా అక్కడే ఉన్నాడు. వాసు ముఖం చిట్లించాడు.

"నీకు తెలియనిదేముంది, రామూ! ఈ రోజుల్లో డాక్టర్ని ఇంటికి పిలిపించి వైద్యం చేయించాలంటే మాటలా? హాస్పిటల్ కి రానంటే రానని మొండికేసింది. మేమంతా వెళ్లటంలా? ఈవిడ ముఖాన్నే పొద్దు పొడిచిందా?"

"కానీ ఆవిడ రానంటున్నప్పుడు..."

"రాకపోతే మానెయ్యమను. తలమునగా ఖర్చుల్లో ఉన్నాను. వృద్ధాప్యంలో ఈ జబ్బు కాకపోతే మరొకటి. అనవసరంగా రూపాయలు కుమ్మరించటానికి దగ్గిర సంచులు లేవు..." మొండిగా అన్నాడు.

"చూడన్నయ్యా! ఈయన ఈ తంతు, ఆవిడ ఆ తంతు! నిష్కారణంగా హత్యాపాతకాన్ని మూట కట్టుకుంటానేమోనని హడలి చస్తున్నాను. ఏ గంగలో దిగనూ!" ఏడుపు గొంతుకతో సుభద్ర.

ఎవరికి చెప్పనూ? ఏమని చెప్పను?

ఏం చెయ్యాలో పాలుపోక లేవబోయాను. నా చేతులు గట్టిగా పట్టుకున్నారు తులసమ్మగారు.

అంత నీరసంగా పడివున్న ఆ కట్టెలో అంత బలం ఎక్కణ్ణించి వచ్చిందో?

భల్లూకపు పట్టు ఇలాగే ఉంటుందేమో!

ఆ నాడు మార్కండేయుడు శివలింగాన్ని ఇలాగే వాటేసుకున్నాడేమో!

"చిట్టీ!"

అంతకంటే మాట్లాడలేకపోయారు తులసమ్మగారు. దీనంగా, దీనాతిదీనంగా చూస్తున్నారు నా వంక. ఆ చూపులకు తట్టుకోలేకపోయాను.

"మిమ్మల్ని నాతో తీసుకెళతాను. ఉండండి. టాక్సీ తీసుకొస్తాను" అనేశాను.

ప్రేతకళ తాండవిస్తున్న ఆవిడ ముఖంలో జీవచైతన్యం గుప్పున వెలిగి అంతలో కళ తప్పింది.

"అయ్యో! ఇదెక్కడి అప్రతిష్ఠ! అన్నయ్యకెందుకీ తగులాటం! వద్దని చెప్పండీ! వెళ్ళి డాక్టర్ని తీసుకురండి!"

వాసును ప్రాధేయపడింది సుభద్ర.

వాసు కరగలేదు.

"మీ అన్నయ్య కంత బులపాటంగా ఉంటే తీసుకెళ్లమను. మా అమ్మకు వైద్యం చేయించమని మీ అన్నయ్య కాళ్లు పట్టుకున్నానా నేను, నువ్వు నెత్తి మొత్తుకుందుకు? తలకి మించిన బరువు తలకెత్తుకుంటే సంసారాలు తలకిందులయిపోవూ? ఎందుకు, ఇన్నేళ్లొచ్చి బుద్ధి లేక పోయాక?..."

ఇంక లాభం లేదనుకుని బయలుదేరాను.

భయమూ, ఆశా కలబోసుకున్న తులసమ్మగారి చూపులు నన్ను తరుముతున్నాయి.

శారదతో ఒకమాటయినా చెప్పలేదు. శారద అంగీకారం తీసుకోలేదు. శారద ఏమంటుందో? నచ్చజెప్పగలననే ధైర్యం! నా మాట కాదనదనే నమ్మకం! నే ననుకున్నట్లే టాక్సీలోంచి తులసమ్మగారిని నేనూ, డ్రైవరూ లోపలికి తీసుకువస్తుంటే తెల్లబోయి చూసింది శారద. సభ్యత, సంస్కారం కలది కనక నోరు విప్పకపోగా గలగల ఆవిడకు పక్క ఏర్పాటు చేసింది.

"చిట్టీ! డాక్టరు..."

సన్నగా సణుగుతున్నారు తులసమ్మగారు.

"పిలుచుకొస్తున్నానండి!" అంటూనే శారదను నెమ్మదిగా చాటుకు పిలిచాను.

"క్షమించు, శారదా! నీకు చెప్పకుండా ఇలా చెయ్యవలసి వచ్చింది. కాస్త నా మాట నిలబెడతావు కదూ!"

"మాటకేం? అదే నిలబడుతుంది, మూట వదిత్తే! అయినా ఇదెక్కడి వెర్రి? ఎక్కడో దూరపు చుట్టాన్ని ఈ దశలో తెచ్చి పెట్టుకుంటారా ఎవరైనా? ఎవరూ లేకపోతే అనుకోవచ్చు, కొడుకూ కోడలూ ఉండగా. అదీగాక ఇద్దరం ఉద్యోగాలమీద పోయేవాళ్లం, ఈవిడ నెవరు చూస్తారు?"

శారదకు జరిగింది సాధ్యమైనంత కరుణాత్మకంగా వివరించి "ఏం చెయ్యను, శారదా! ఒక నిండుప్రాణం కళ్లెదురుగా జీవం కోసం చెయ్యిజాపి ప్రాధేయపడుతూంటే కాదనలేకపోయాను" అన్నాను కొసరుగా.

"సరేలెండి."

"ఛస్తే చచ్చింది" అనగలిగేంత కాఠిన్యమూ లేక, 'డబ్బు పోతే పోయింది' అనుకోగలిగే ఔదార్యమూ రాక ముభావంగా అంది శారద.

అంతే చాలనుకున్నాను. అంతకంటే శారదనుంచి ఆశించటం అన్యాయం.

డాక్టర్ని పిలిపించాను. ఆవిడ దగ్గర కనిపెట్టుకుని ఉండటానికి ఆయాను కుదిర్చాను. ఇంతయినా ఆవిడ బ్రతికి బట్ట కడుతుందని అనుకోలేదు. పదిహేను రోజుల్లోనే ఆవిడ లేచి తిరగటం మొదలుపెట్టింది.

నెల రోజులలో ఎప్పటి తులసమ్మగారిలా తయారయింది. ఆయాను తనే మానిపించేసింది.

"రోజులు నిండిన ముండని. నా కింకా మందు లెందుకురా?" అని వైరాగ్యం ప్రకటించి మిగిలిన మందులన్నీ పారబోసింది. వంటిల్లు హస్తగతం చేసుకుని కమ్మకమ్మని వంటకాలు చిటికెలో చెయ్యటం కూడా మొదలుపెట్టింది. ఇద్దరం ఉద్యోగాలు చేసుకొంటున్నాం. ఆ కారణంగా వంటమనిషి కోసం చాలా కాలంగా ప్రయత్నిస్తున్నాను. మాకు నచ్చిన మనిషి మేం ఇయ్యగలిగే జీతంలో కుదరక అవస్థ పడుతున్నాం.

ఇల్లు ఇల్లంతా చక్కబెట్టుకొంటూన్న తులసమ్మగారిమీద శారదకు ఎక్కడలేని ప్రేమా పుట్టుకొచ్చింది.

"అమ్మమ్మగారూ!" అంటూ ఇచ్చకాలుకూడా మొదలు పెట్టింది. ఇంటి కెళతానని ఆవిడ అనలేదు.

అ మాట నే ననటం బాగుండదేమోనని సంకోచిస్తున్నాను నేను.

ఆ ప్రస్తావన ఎక్కడ వస్తుందోనని భయపడుతూంది శారద, తులసమ్మగారిని వదులుకోలేక.

అట్లాంటి సందర్భంలో వచ్చాడు వాసు.

"జరిగింది చాలుగాని ఇంటికి నడు." అన్నాడు పరమ గంభీరంగా, అక్కడికి తులసమ్మగారు ఏదో మహాపచారం చేసినట్లూ, తను విధిలేక సర్దుకుపోతున్నట్లూను.

ఏదో పెద్ద పనున్నట్లు నన్ను చాటుకు పిలిచింది శారద. "చూశారా? ఎంత స్వార్థమో! ఆ నాడు పుట్టెడు రోగంతో ఉన్న

మనిషిని వెళ్లగొట్టాడు. ఈ నాడు బాగుపడింది కదా అని చాకిరీకి రమ్మంటున్నాడు. పంపనని చెప్పెయ్యండి" ఆదుర్దాగా అంది.

సరే అన్నట్లు తల ఊపాను.

స్వార్థంట! ఎవరికి స్వార్థం లేదు? కన్నకొడుకు దగ్గిరికి తల్లిని పంపవద్దనటంలో శారదకు స్వార్థం లేదూ! కానీ తనలో ఈ స్వార్థం ఉన్నట్లు శారదకే తెలీదు. చెప్పినా ఒప్పుకోదు. బాధపడుతుంది. స్తిమితంగా ఆలోచిస్తున్నాను కనక ఈ మంచిచెడ్డ లింత ఏర్పాటుగా తెలుస్తున్నాయి గాని ఒక ఆవేశంలో జీవిస్తున్నప్పుడు నాకయినా ఈ మంచి చెడ్డలు తెలియవు. అన్నీ ఒకదానిలో ఒకటి కలిసిపోయి కనిపిస్తాయి. ఈ ఆవేశమే జీవచైతన్యం. ఇది అణగారిపోయిన వాళ్లు అయితే యోగులు, కాకపోతే జీవచ్ఛవాలు.

"పంపను" అని నే ననవలసిన అగత్యం లేకపోయింది. తులసమ్మ గారి గొంతు తారస్థాయితో పలుకుతూంది.

"ఏ ముఖం పెట్టుకుని వచ్చావురా! ఆపదలో ఆదుకున్నవాళ్లే ఆప్తులు. కొడుకయినా, అల్లుడయినా, మనవడయినా చిట్టే నాకన్నీ శారదమ్మే నా కళ్ల వెలుగు. మీకూ నాకూ ఏ సంబంధం లేదు! రాను, రానంటే రాను! ఎంతమాత్రం రాను."

"రావూ! చూడు! మళ్లీ ఇంకోసారి పిలిచావంటే నీ గడ్డి నీకు తినిపిస్తాను."

"అదేదో నీ పెళ్లాం నీకు బాగా తినిపించబట్టే నాకీ గతి పట్టించావు. నువ్వూ నీ పెళ్లాం కట్టకట్టుకు ఊరేగండి! ముసలిముండ పీడ విరగడయిందని పండగ చేసుకోండి. ఇంక ఆ గడప తొక్కను." వాసు విసురుగా వెళ్ళిపోయాడు.

ఒక ప్రేక్షకుడిలా ఉండిపోయాను నేను.

శారద మాత్రం పొంగిపోయింది.

అమ్మమ్మగారిమీద ఆపేక్ష మరింత పెరిగింది. శారద ఎన్నాళ్ల నుంచో అనుకుంటూంది రవ్వ పొదిగిన ఉంగరం నాకు చేయించాలని. ఆ రోజు తయారయితే ఇంటికి తీసుకువచ్చింది. నేను చూసి బాగుందని మెచ్చుకున్నాను.

"మీ బర్త్ డేకి నా ప్రెజెంట్!" అంది శారద ఎంతో సంతృప్తిగా.

ఉంగరంకన్న శారద ముఖంలో ప్రతిఫలించిన సంతృప్తి కొన్ని రెట్లు బాగుంది నాకు.

"వెరీ మెనీ థాంక్స్" అన్నాను.

"ఛ! ఛ! థాంక్స్ చెప్పటం చేతకాదు" అంది శారద బుంగ మూతితో.

నేను నవ్వుకొని ముడుచుకున్న శారద పెదవులమీద ముద్దు పెట్టుకున్నాను. కిలకిల నవ్వింది శారద.

"ఏమిటర్రా!" అంటూ వచ్చారు తులసమ్మగారు.

తనకి అవసరమున్నా లేకపోయినా మా విషయాల్లో కలిగించు కోవటం తులసమ్మగారు మానరు. ఇది మాకు కొంత చికాకు కలిగించినా చాదస్తంలే అని సరిపెట్టుకోవటం నేర్చుకున్నాం.

శారద నాకు కాస్త ఎడంగా జరిగి ఉంగరం తులసమ్మగారికి చూపించింది.

"ఎంత బాగుందో? చిట్టీ! ఒక్కసారి వేలికి పెట్టుకోరా, ఈ పాపిష్టికళ్లతో చూస్తాను" అన్నారు.

నేను పెట్టుకున్నాను.

"నీ వేలికి బాగా నప్పిందిరా! పచ్చని వేలేమో, ధగధగ మెరిసి పోతూంది."

బోసినోటితో నవ్వింది. నేనూ, శారదా నవ్వుకున్నాం. బాగా తిరుగుతున్న తులసమ్మగారు మళ్లీ హఠాత్తుగా అడ్డం పడిపోయారు ఒకనాడు.

శారదా, నేను చాలా కంగారుపడ్డాం. డాక్టర్‌ని పిలిపించాం. వారం రోజులయినా మనిషి కోలుకోలేదు. నానాటికీ శుష్కించిపో తూంది. రాను రాను ఒంటిమీద తెలివి తగ్గిపోసాగింది. అహర్నిశమూ ఒకటే పలవరింత— "వాసు" అని.

వాసు దగ్గిరికి వెళ్ళి సంగతి చెప్పిరమ్మన్నాను.

"నేను రాను. ఆ నాడు అంత మొండిగా తెగేసి చెప్పిందిగా! ఈ నాడు కలవరిస్తుందేం? దొంగప్రేమ! 'నీకు వాసు లేడ'ని చెప్పు. అన్నింటికీ నువ్వు ఉన్నావుగా!" కరుగ్గా అన్నాడు వాసు.

తులసమ్మగారి పరిస్థితి మరింత క్షీణించింది.

డాక్టర్ పెదవి విరిచి "ఆ వాసు ఎవరో పిలిపించండి"అన్నాడు.

ఆ పరిస్థితిలో సహితం రానని మొండికేసిన వాసుని చూస్తే అసహ్యం వేసింది.

"రాకపోతే వీల్లేదు. వచ్చి తీరాలి" అని బలవంతాన టాక్సీలో కూలేశాను.

ధుమధుమలాడుతూనే వచ్చాడు తల్లి దగ్గిరికి. జీవన్మరణ సంధ్యలో కొట్టుమిట్టాడుతున్న ఆవిడకు వాసును చూడగానే లేని శక్తి వచ్చినట్లయింది. నోరు పడిపోయిన ఆ దశలో దగ్గిరికి రమ్మన్నట్లు తల ఊపింది. శిలలా నించున్న వాసుని ఆవిడ దగ్గిరకు తోశాను. మూసిన తన గుప్పెట వాసు చేతిలో బిగించి ప్రాణాలు వదిలారు ఆవిడ.

ఆశ్చర్యంతో ఆ గుప్పిడి తెరిచాడు వాసు. అందులోంచి ధగధగ మెరుస్తూ బయట పడింది—క్షుద్రత్వపు పునాదుల మీద నిలిచిన ఔన్నత్యం, స్వార్థంలో తడిసిన నిస్సార్థపు మమత, నైచ్యం వెన్నంటిన త్యాగం, సృష్టిరహస్యం – రవ్వ పొదిగిన ఉంగరం!

# పంచమి

కథల సంపుటి

అవసరాల రామకృష్ణారావు

మంజుశ్రీ

శీలా వీర్రాజు

లత

సి. ఆనందారామం

యువభారతి
ప్రచురణ